# రామమోహన నాటకము.

ఇది

ఆదిపూడి సోమనాథరావుచే

రచియింపఁబడినది.

---

మొదటికూర్పు 1000.

---



పిఠాపురము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

1913.

*Copy-right.*]

[వెల రు 0-6-0.

# పీఠిక.



మానవసేవవారికి వారిపత్రికలో ముద్రించుటకు నొక్క-శతకమునొక్క-నాటకమునియ్యవాగ్దత్తము చేసితిని. శతకమిచ్చితినిగాని నాటకము మాత్రము మూఁడుసంచికలకుఁ బంపి కొన్నియనివార్యములచేత శేషమును బూర్తిచేసి పంపలేకపోయితిని. ఇప్పుడు మారాజాగారికి ద్వితీయపుత్రరత్నము గలిగినందున నారాజకుమారుని బారసాలమహోత్సవమునాఁటికిఁ బూరించి యచ్చొత్తించితిని. నాటకము వ్రాయుటకు నాకిది ప్రథమ ప్రయత్నము. అంత రసవంతముగా నుండక పోవచ్చును. పెద్దలు క్షమింతురు గాక. త్వరలో సర్వోత్తమముగా నచ్చొత్తించిన శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాశాలాధికారులకు నాకృతజ్ఞతాపూర్వక వందనములు.

పిఠాపురము.
10-11-13

ఆ. సోమనాథరావు.

# విన్నపము.



సీ. నాటకకార ర ♦ త్నంబులౌ "షేక్స్పియర్"
 "కాళిదా" సాదుల ♦ గౌరవించి
కవిచక్రవర్తులై ♦ క్రాలుచుండెడు నట్టి
 "వాల్మీకి" మొదలగు ♦ వారిఁ బొగడి
నవ్యభవ్యప్రౌఢి ♦ నాటకమ్ము లొనర్చు
 మహనీయతతిని స ♦ న్మతి నుతించి
సకలబ్రహ్మాండనా ♦ టకసూత్రధారియౌ
 జగదీశ్వరునకు ♦ సాష్టాంగ మెఱఁగి
గీ. నన్ను మన్ననసేయు ప్ర ♦ సన్నమూర్తి
 రావుకులమణి శ్రీసూర్య ♦ రావు నెన్ని
 రామమోహనరాయల ♦ రమ్యచరిత
 నాటకమ్ముగఁ గూర్చితి ♦ నవ్యఫణితి.
క. తప్పులు లే వని చెప్పను
 దప్పులు గల వనుచుఁ జెప్పఁ ♦ దప్పులు గలచో
 నొప్పులుగఁ దిద్ద వేఁడెదఁ
 దప్పొప్పులు దెలియ నేర్చు ♦ తజ్జ్ఞుల నెల్లన్.

ఇట్లు విన్నవించు
సజ్జనసేవకుఁడు,
ఆదిపూడి సోమనాథరావు.



శ్రీ రాజా రామమోహనరాయలు.

Scape & Co., Block Printers, Cocanada.



# రామమోహన నాటకము.

## నాంది.

( సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఉ. ఏకరుణాసుధానిధి యహీనధృతిన్ బురికొల్పుచుండునో
లోకమునన్ బరోపకృతిలోలుల చిత్తములోన, నాతఁడ
స్తోకసుఖప్రవర్షములఁ దోఁగఁగఁ జేయును గాత మిమ్ములన్
బ్రాకటధర్మమూర్తుల సభాసదులన్ బరిశుభ్రకీర్తులన్.

(అని నాంద్యంతంబున నందన యంజలిలోని కుసుమంబుల సభాసదులపైఁ జల్లి తెరవంకఁ జూచి) ప్రియా! గుణవతీ! ( యని తన ధర్మపత్నిని బిలుచుచున్నాఁడు. )

గుణవతి—(ప్రవేశించి) స్వామీ! ఆర్యపుత్ర! ఏమి సెలవు?

(అని వినయముతో నడుగుచున్నది.)

సూ—ఏమహానుభావుఁడు అధఃపతితమైనయార్యావర్తము నుద్ధరింప నెంచి పరమకృపాళువగు పరమేశ్వరుఁడు దనకుఁ బ్రసాదించిన సమస్తశక్తులను వినియోగపఱచి సకలకలా పరిపూర్ణుండగు శరత్పూర్ణిమా చంద్రువింబోలె మనహృదయాకాశంబులఁ గీర్తికాయంబుతో నిరంతరంబు ప్రకాశించుచున్నాఁడో, అట్టి శ్రీరాజారామమోహనరాయలపవిత్రచరిత్రను నేఁటిరాత్రిఁ బ్రదర్శింపవలెనని పెద్దలు సెలవిచ్చి

యున్నారు. ఈసదుద్యమమున నాకుఁ దోడ్పడుటకై నిన్నుఁ బిలిచితిని.

గు—స్వామి!

గీ. పతికి సత్కార్యములఁ దోడు ♦ పడుట కంటె
సతికి ధన్యతరంబైన ♦ చర్య కలదె?
సీత మొదలగు సాధ్వు లీ ♦ రీతి నడచి
జననసాఫల్య మొనరించు ♦ కొనిరి కాదె!

కాఁబట్టి మీయర్థాంగి నైనందులకు సార్థకంబుగ నీయుత్తమ కార్యంబున నాశక్తికొలంది మీకుఁ దోడ్పడి కృతార్థురాల నయ్యెదను. స్త్రీజాతియందుఁ దనకుఁ గల గౌరవాధిక్యంబుచే వారి దురంతచింతలనెల్లఁ దొలంపంబూని నిరంతరంబు కృషిచేసిన యాపరోపకారపారీణుని పవిత్ర చరిత్రను బ్రదర్శించుటకుఁ దోడ్పడు సౌభాగ్యంబు నాకుఁ గల్పించి నందులకు మీకు నే నెంతయును గృతజ్ఞురాలను. నేఁటి మీప్రయత్నంబు సభాసదుల కెంతయు సంతృప్తిగ సఫలంబగును గాక!

సూ—ప్రియా! అదే సంశయము.

గు—అ ట్లేల సెలవిచ్చెదరు? మీరు ధర్మాత్ములరు. మీశిక్షలో మెలఁగినమీశిష్యులందఱును వినయవివేకాదిసద్గుణంబులచే నలరారుచున్నవారు. చరిత్ర యన్ననో భక్తిరసప్రధానమైనది. సభాసదులు నీతిసంపన్నులైనగుణగ్రాహణ

పాకీజులు. నీతివంతులే నీతిని బోధింపఁ జాలరేని దుర్నీతిపరు లా నీతిని నేర్పువారు? నిస్సంశయముగ నేఁటి మీ యుద్యమము చక్కఁగ నెఱవేఱఁగలదు.

సూ—మంచిది. పరమేశ్వరునిపై భారము వైచి శక్తికొలఁది మనము పాటుపడుదము. అటు చూడు! సభాసదులు ఆటఁ జూడవలె నని యెంత కుతూహలముతో నిరీక్షించుచున్నారో? కాని తెరలోపల నంతయు నింకను సంసిద్ధముగ లేదు. కనుక వీరి తమకమును నీగానముచేఁ గొంత శాంతి పఱపుము.

న—చిత్తము. ఏఋతువునుగూర్చి పాడుదును?

సూ—ఈఋతు వాఋతు వన నేల? ఎల్లఋతువులను సృజించి ప్రపంచమునంతను నానందసాగరములో నోలలాడించుచుండు కరుణామృతవారిధి యగుపరమేశ్వరుని గీర్తింపుము.

న—చిత్తము.

సీ. హృదయనందనమును ♦ ముదముతోఁ బాదలించు
సంతోషదాయి వ ♦ సంతుఁ డెవఁడు
భావంబులోపలి ♦ పాపజాలమ్ములఁ
బట్టి పీల్చెడు గ్రీష్మ ♦ భానుఁ డెవఁడు
స్వాంతంబులో శాంతి ♦ వర్షంబు గురియుచుఁ
గాఁ్రెడు ఘనఘనా ♦ ఘనుఁ డెవండు

చేతమ్ములోపలఁ ♦ జిత్కళల్ వెదచల్లు
శారదపూర్ణిమా ♦ చంద్రుఁ డెవఁడు
గీ. మత్తమతి వణకించు హి ♦ మంతుఁ డెవఁడు
చిత్తదోషమ్ములను రాల్చు ♦ శిశిరుఁ డెవఁడు
అతఁడు సద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.
సీ. జీవకోటుల కెల్లఁ ♦ జిత్రతరంబులౌ
తనువు లొసంగెడు ♦ తండ్రి యెవఁడు
జీవనాధారమై ♦ చెల్లు నాహారముల్
దయ నొడఁగూర్చెడు ♦ తల్లి యెవఁడు
వెలుపల లోపల ♦ వెలుఁగుచు నాత్మలో
జ్ఞానంబు గూర్చు నా ♦ చార్యుఁ డెవఁడు
నిఖిలసంతాపముల్ ♦ నెమ్మితోఁ జల్లార్చు
నానందమయుఁ డైన ♦ యాప్తుఁ డెవఁడు
గీ. వింతగా యోగిరాజహృ ♦ ద్వీథు లందు
సతము వాహ్యాళి వెడలెడు ♦ స్వామి యెవఁడు
అతఁడు సద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

సూ—ఆహా! నీగానమహిమ! భక్తిరసపూరితమైన రామమోహనుని యుపన్యాసమువలె సభాసదుల నందఱిని భక్తిపరవశులనుగాఁ జేసివైచినది.

గు—స్వామి! రామమోహనుని యుపన్యాస మనఁగానే జ్ఞప్తికి వచ్చినది. ఇప్పుడు రాఁబోవు ప్రథమరంగము రాధా నగరములోని రామమోహనుని యుపన్యాసము గదా!

సూ—అవును. అవును. పద! పద! అంతయు సంసిద్ధముగ నున్నది. మనమును మనమన పనులలో నిఁకఁ బ్రవేశింతము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.



# రామమోహననాటకము.

## ప్రథమాంకము.

౧ వ రంగము—రాధానగరమునందలి యుద్యానవనము.

[అనేకులు ఎదుట నిలఁబడి శ్రద్ధతో వినుచుండఁగా రామమోహనుఁ డుపన్యసించుచున్నాఁడు.]

రామ— అఖండసామ్రాజ్యైకధురంధరుం డగుపరమేశ్వరుని యనుంగుబిడ్డలారా! మదీయసోదరులారా! లేశమైనను స్వార్థపరత్వము లేక కేవలము పరమార్థముకొఱకే తమ యావజ్జీవమును సమర్పించినఋషిసత్తములు, పరమేశ్వర విషయమైనతమయనుభవముల నుపనిషత్తుల రూపమున మనకుఁ బ్రసాదించియున్నవారు. వానిని శ్రద్ధతోఁ బఠించి వానియర్థమును గ్రహించి తదనుసారముగ మనము ప్రవర్తించినఁగాని యాఋషిఋణమునుండి మనము విముక్తులము గాఁ జాలము. ఈ నాలుగుసంవత్సరములుగ నేను వారణాసిలోఁ బఠించి గ్రహించినయుపనిషత్సారమును నాయనుభవమును మీయెదుటఁ బెట్టుచున్నాను. సావధానచిత్తులరై చిత్తగింపుఁడు.

'ఈశావాస్య మిదగ్ం సర్వమ్' అంతయుఁ బరమేశ్వరునిచేత వ్యాపింపఁబడియున్నది. అతఁడు లేని ప్రదేశమే లేదు.

'అపాణిపాదో జవనోగ్రహీతా పశ్యత్యచక్షు స్సశృణోత్యకర్ణః సవేత్తి విశ్వంనచతస్యాస్తివేత్తా' అతనికిఁ జేతులు లేవు; అన్నిటిని బట్టుకొనుచున్నాఁడు. అతనికిఁ గాళ్ళు లేవు; అందఱికంటె వేగముగఁ బరుగెత్తుచున్నాఁడు. అతనికిఁ గన్నులు లేవు; అన్నిఁటిని జూచుచున్నాఁడు. అతనికిఁ జెవులు లేవు; అంతయు వినుచున్నాఁడు. అతఁడు అంతయుఁ దెలియుచున్నాఁడు; గాని యతనిని సంపూర్ణముగఁ దెలిసినవా రెవ్వరును లేరు. అనఁగా నతఁడు సర్వగతుఁ డగుటచేత నిరవయవుఁడును నిరాకారుఁడు నై యన్నిఁటిని జేయుచు నన్నిఁటిని వినుచు నన్నిఁటిని గనుచు నద్భుతముగాఁ బ్రకాశించుచున్నాఁడు.

'నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాంఏకోబహూనాం యో విదధాతికామాన్ తమాత్మస్థంయేనుపశ్యంతిధీరాః తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషాం'

అతఁడు నిత్యమైనవస్తువులలో నెల్ల నిత్యమైనవాఁడు. చైతన్యవస్తువులలో నెల్ల మహాచైతన్య మైనవాఁడు. అన్నిఁటిలో నొక్కఁడై ప్రకాశించువాఁడు. కోరికలను బ్రసాదించువాఁడు. ఆత్మలో నెలకొన్నవాఁడు. ఇట్టి పరమాత్మను దమలో దర్శించు ధీరులకే శాశ్వతమైనశాంతి. తదితరులకు లేదు.

'ఏకమేవాద్వితీయమ్' అతఁడు ఒక్కఁడే యొక్కఁడు.

అద్వితీయుఁడు. అతనితో సమానమైనవాఁడు మఱెవ్వఁడును లేఁడు.

'బ్రహ్మకృపాహి కేవలమ్' అతఁడు కేవలము దయాస్వరూపుఁడు. అతని కరుణయే మనకు శరణ్యము.

వినుఁడు!

సీ. కొండలఁ జెండాడు ♦ చండమారుతమును
మందానిలంబుగా ♦ మార్చె నెవఁడు
దర్పించి జగముల ♦ దహియించు సూర్యుని
హితబుతుకర్తఁ గా ♦ వించె నెవఁడు
మించి లోకమ్ముల ♦ ముంచు సంద్రమ్మును
శాంతిధామమ్ముగా ♦ సలిపె నెవఁడు
పిడుగుల వెదచల్లు ♦ పృథుమేఘముల యందుఁ
గూర్మిశీతలవృష్టిఁ ♦ గూర్చె నెవఁడు
గీ. పూని యన్యోన్యవైరులౌ ♦ భూతములను
జేర్చి వింతఁగ భువనాళిఁ ♦ జేసె నెవఁడు
అతఁడు సద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

వినువారలలో నొకఁడు—ఆహా! పరమేశ్వరుఁ డెంతటి కరుణాళువు?

రా—ఆపరాత్పరుఁ డగుపరమేశ్వరుని వర్ణించుట కెవ్వరు సమర్థులు?

వినుఁడు.

సీ. ఎవని తేజోగ్నిసం ♦ భవవిస్ఫులింగమై
పరిజ్వరిల్లుచు నుండు ♦ భాస్కరుండు
ఎవని యశోకల్ప ♦ వృక్షప్రసూనమై
చల్లఁగఁ గాల్ నిండు ♦ చందురుండు
ఎవని ప్రభావవా ♦ హిని బుద్బుదంబులై
తద్దయు రాజిల్లు ♦ తారకములు
ఎవని సామ్రాజ్యమై ♦ భవరమాస్థానమై
బ్రహ్మాండకోటులు ♦ పరిఢవిల్లు
గీ. ఎవని కరుణానువృష్టి ఫ ♦ లించునట్టి
చారుసస్యంబు భక్తమ ♦ నోరథంబు
అతఁడు సద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.


SREE VEMANA ANDHRA BHASHA NILAYAM ... 1923.

మఱియొకఁడు—ఆహా! ఏమి పరమేశ్వరుని యొక్క ప్రభావ వైభవములు?

రా—నెచ్చెలులారా! పరమపిత యగుపరమేశ్వరుఁడు పరమాద్భుతముగ నీప్రపంచమును సృజించి దీనిలోఁ దన యపారమహిమాదులను నింపి దీనిని మనమెఱింగి నిశ్చంచలమైనభక్తితో నతని నారాధించుటకై యతివిచిత్రమైన మానవశరీరమును మనకుఁ బ్రసాదించి తానే స్వయముగా మనహృదయపీఠమునం దధివసించి “పుత్రులారా! అదిగో!

ప్రపంచములోని నాశక్తిసామర్థ్యములను నాదయాన్యాయ ములను నామహిమావిశేషంబులను గనుంగొని నన్ననుక రించి కృతార్థులు గం" డని ప్రతినిమిషమును మన హృదయములలో నుద్ఘోషించుచుండినను, మన మాపవిత్ర వాక్యములను బెడచెవిని బెట్టి విగ్రహముల నలంకరించుట యందును వానికి నుత్సవములను జేయుటయందును మన యమూల్యమైనకాలము నంతను వ్యర్థపఱచుచున్నాము.

మఱియొకఁడు—సత్యము. సత్యము.

రామ—ద్విపద.

చిత్రవిచిత్రమా ♦ సృష్టిఁ గన్గొనిన
మాత్రన యామహా ♦ మహు మహిమంబు
వెల్లడి యగుచుండ ♦ విగ్రహములను
జెల్లునే పూజింప? ♦ స్నేహితులార!
మనవలె నాతని ♦ మనుజునిఁ జేసి
మనకంటె హీనుఁగా ♦ మఱిమఱిఁ జేసి
దినదిన మొకమెట్టు ♦ దిగి దిగి కొనకు
ఘనమైన యజ్ఞాన ♦ గాఢాంధకార
మున మునింగితి మయో! ♦ మూర్ఖత మనము.
కనులేని వానిని ♦ గనులేని వాఁడు
నడుపంగఁ బూనిన ♦ నడువడి యయ్యె.
విడరాదె యిప్పుడైన ♦ విగ్రహపూజ?

ఆ జగదీశ్వరు ♦ నా జగత్పితను
ఆ జగదాధారు ♦ నా జగన్మాత
నా జగన్మిత్రుని ♦ నా జన్మరహితు
నా జగజ్జ్యోతిని ♦ నందఱుఁ గూడి
హృదయాబ్జమందున ♦ నేకాగ్రవృత్తి
ముదమారఁ బూజించి ♦ మోక్షంబుఁ గోరి
మన చిత్త మతనికి ♦ మఱి సమర్పించి
యనిశంబు నాతని ♦ యాజ్ఞలో మెలఁగి
నీతియు శాంతియు ♦ నిర్వైరతయును
బ్రీతియు సత్యంబుఁ ♦ బెంపారుచుండ
వర్తిల్లుచుండి జీ ♦ వనయాత్ర దీనిఁ
బూర్తి చేయుటకంటెఁ ♦ బుణ్యంబు కలదె?

అందఱు—మిత్రమా! నీయొక్క యుపదేశామృతము చేత మాహృదయములను పావనముఁ జేసితివి. మే మింక విగ్రహముల నెన్నఁటికిని బూజింపము. నేఁటితో విడచి పెట్టితిమి. ముమ్మాటికి విడచిపెట్టితిమి. పరమేశ్వరుని యొక్క యనంతకల్యాణగుణములను నీబోటిమహాత్ములనుండి వినుచుఁ బ్రపంచమునందుఁ జూచుచుఁ జూచినదానిని విన్న దానిని బరులకుఁ దెలుపుచు, మాటిమాటికి మదిలోఁ జింతించుచు నోటితోఁ గీర్తించుచుఁ గ్రియాశూరులమై ప్రవర్తిల్లెదము. పరమేశ్వరుఁడు నీ సద్వాంఛితముల నెఱ

వేర్చును గాక! నీ కాయురారోగ్యములఁ బ్రసాదించును గాక! ధర్మము వర్ధిల్లును గాక! సత్యము జయించును గాక!

రా—నా యీ కడపటివాక్యములను జిత్తగింపుఁడు.

అందఱు—వినుఁడు. వినుఁడు. వినుఁడు.

రా-సీ. దయ హృదయంబునఁ ♦ దాల్చి మెలఁగుశే
యెవని సేవఁగ భక్తు ♦ లెన్నుచుండ్రు
న్యాయమార్గంబున ♦ నర్మిలి నడుచుశే
యెవని సేవఁగ నార్యు ♦ లెన్నుచుండ్రు
సత్యపాలనమున ♦ సర్వ మర్పించుశే
యెవని సేవఁగ బుధు ♦ లెన్నుచుండ్రు
ప్రాణిమాత్రమునకు ♦ భద్రమ్ము గూర్చుశే
యెవని సేవఁగ ఋషు ♦ లెన్నుచుండ్రు
గీ. స్వార్థమును వీడి పరమార్థ ♦ మందుఁ జనుశె
యెవని సేవఁగ యోగీంద్రు ♦ లెన్నుచుండ్రు
అతఁడు సద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

అందఱు—ఆహా! ఇది యెంతయు మన హృదయఫలకమందు సువర్ణముతో లిఖింపఁదగి యున్నది.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



## 2 వ రంగము.

రామమోహానుని తండ్రి యగురమాకాంతరాయని గృహము.

[రామమోహానునితల్లి తారణీదేవి ప్రవేశించుచున్నది.]

తా—(చాఁపమీఁదఁ గూరుచుండి వీవనతో విసరికొనుచు) ఏమి యెండ! ఏమి యెండ! మంగలములోఁ బెట్టి మల మల మాడ్చివేయున ట్లున్నది. ఎంత నీరు ద్రాగినను దప్పి తీరుట లేదు. గుప్పుగుప్పుమని వడగాలి గొట్టుచున్నది. రాధాకృష్ణ! రాధాకృష్ణ! ఇదేమి చెమట? చెమటలో మునిఁగిపోవు చున్నాను. ఎన్నఁడును మధ్యాహ్నము నిద్రపోయిన దానను గాను. నేఁ డదేమో కన్నులు మూసికొనిపోవు చున్నవి. రాధాకృష్ణ! రాధాకృష్ణ! (అని పండుకొనఁ బోవుచుండఁగా శారద, శరత్కుమారి, సౌదామిని మొదలగు నిరుగుపొరుగింటి స్త్రీలు ప్రవేశించుచున్నారు. వారిని జూచి లేచి కూర్చుండి)

తా—అమ్మా! శారదా! శరత్కుమారీ! సౌదామినీ! ఇదేమమ్మా! ఇంత మిటమిటమధ్యాహ్నములో బయలుదేరి వచ్చినారు.

ఆ. మింటినడిమి కరిగి ♦ మించి మార్తాండుండు
చండకిరణములను ♦ జగతి నెల్ల
మాడ్చివేయఁ గినుక ♦ మండుచు నున్నాఁడొ
యెఱుఁగరా దిదేమి ♦ యెండ నేఁడు!

తే. సుంతయైనను దయలేక ♦ చురచుర మని
తరణి కిరణాళి నిప్పులు ♦ గురియుచుండ
బైటఁ దలపెట్టఁగా నోడి ♦ పక్షిగణము
పాదపమ్ముల నిదురించెఁ ♦ బట్టపగలె.

ఇంతయెండలోఁ గాళ్లు కాల్చుకొని రావలసినపని యేమి వచ్చినదమ్మా? రండు. కూర్చుండుఁడు.

శా—అమ్మా! సనాతనముగ వచ్చుచుండు ధర్మము మండి పోవుచుండఁగాఁ గన్నులారఁ జూచుచుండుమాయొడళ్లు సూర్యునియెండచే భగ్గున మండిపోయినను బాగుండును.

తా—శారదా! నీమాట లేమియు నా కర్థ మగుట లేదు. స్పష్టముగాఁ జెప్పుము.

శా—ఏమున్నది? రాధాకృష్ణులను బూజ చేయఁగూడదఁట. ఇవి బొమ్మలఁట. దేవుళ్లు కావఁట. బూతువిగ్రహము లఁట. వానికంటె మనము మేలఁట.

తా—(కోపముతో) ఎవ రీమాటలు చెప్పినది? వారినాలుక యింకను బడిపోలేదు?

శా—అమ్మా! ఎవ రున్నారు? మీకుమారరత్న మగురామ మోహనుఁడే.

తా—రామమోహనుఁడా? అలాగు చెప్పకుఁడు. మాచిన్న వాఁడు నాయందెంతయు భయభక్తులు గలిగి యున్నాఁడు. గట్టిగ మాటాడి యెఱుఁగడు. అమ్మా! శారదా! ఎనిమి

దేండ్లుగా మావాఁడిక్కడ లేనే లేఁడు. పాటలీపుత్రమునకుఁ బోయి పారసీయరబ్బీలు చదువుకొని రావలసిన దని వాని తండ్రిగారు పంపఁగా నాలుగేండ్లక్కడ విద్య నభ్యసించి వచ్చినాఁడు. తరువాత సంస్కృత మభ్యసించిరావలసిన దని కాశికి నేనుబంపఁగా నాలుగేండ్లచ్చట నధ్యయనముఁ జేసి మొన్ననే వచ్చినాఁడు. మీరు పొరఁబడి యుండ వచ్చును. మా రామమోహనుఁ డట్లు చెప్పియుండఁడు.

శ—అమ్మా! మామాటలయందు లేశమయినను నసత్యము లేదు. నిన్న మనయూరిలోని తోఁటలో నీకుమారుఁ డుపన్యాస మిచ్చినాడఁట. అది వినినప్పటినుండి మాపిల్లలు మమ్మెదిరింప నారంభించినారు. మేము చేయుపూజలనుజూచి వెక్కిరింపఁ జొచ్చినారు. ఎక్కడ లేని యల్లరులును జేయుచున్నారు. సకలమైన యిబ్బందులను బెట్టుచున్నారు. వారు వేయుప్రశ్నలకు నుత్తర మీయలేక చచ్చిపోవుచున్నాము. తల్లీ! మీ రేలాగునైన మీకొమరుని యదలించిననే కాని మేము బ్రదుకఁజాలము.

తా—మంచి దమ్మా. మీరు వెళ్ళండి. ఇంకను మారామమోహనునకు బదునాలేండ్లు గూడఁ బూర్తిగా నిండలేదు. వాఁడు ఉపన్యాస మిచ్చినాఁ డన్నమాట నేను నమ్మఁజాలను. అయినను నే నంతయుఁ గనుంగొని రామమోహనుఁడే తప్పిదము చేసియుండిన యెడలఁ జక్కఁగా మందలించి

బుద్ధిచెప్పి మార్గమునకుఁ దెచ్చెదను. ఇట్టి విషయములలో నే నెప్పుడును నోర్చియుండుదానను గా దని మీకుఁ దెలిసియే యున్నదిగదా!

సా—కాఁబట్టియే మేము మీతో మనవి చేసుకొనవచ్చితిమి.

గీ. ధర్మమార్గంబు దప్పినఁ ♦ దనయునైన
శిక్షసేయంగఁదగు నని ♦ శిష్టు లంద్రు
మీర లీనీతి మదినెంచి ♦ మీకొమారు
దండితుని జేయవలె నమ్మ ♦ ధర్మ మమ్మ.

తా—మీ రింక నొక్కిచెప్పవలసినయావశ్యకము లేదు. ఈ విషయములలో నేను దగినంత శ్రద్ధపుచ్చుకొనియెదను.

(తారణీదేవియొక్క సెలవు గైకొని యందఱు నిష్క్రమించుచున్నారు.)

తా—రామమోహనా! (అని పిలుచుచున్నది.)

(రామమోహనుఁడు ప్రవేశించి తల్లికి నమస్కరించు చున్నాఁడు.)

తా—ధర్మాత్ముఁడవుఁగమ్ము. నాయనా! నీవు నిన్న నుపన్యాసమిచ్చినావా?

రా—చిత్తము. ఇచ్చినాను.

తా—ఏమి యుపన్యసించితివి?

రా—అమ్మా! విద్య నభ్యసించుట సత్యమును గ్రహించుటకును గ్రహించిన సత్యము ననుష్ఠించుటకును బరులకు నుపదే

శించుటకును గాదా ?

తా—అవును గాని, నీ వేమి యుపన్యసించినావు ?

రా—నాయుపన్యాసము యొక్క సారాంశమును బత్రికలుగా వ్రాసి యనేకులకుఁ బంచిపెట్టి యున్నాను. సెలవయిన యెడల దానినే మీయెదుటఁ జదివెదను.

తా—మంచిది చదువు.

రా—చిత్తగింపుఁడు.

ద్వి. చిత్రవిచిత్రమా ♦ సృష్టిఁ గన్గొనిన
మాత్రన యామహా ♦ మహుల మహిమంబు
వెల్లడియగుచుండ ♦ విగ్రహములను
జెల్లునే పూజింప ♦ స్నేహితులార !

తా—చాలుఁ జాలు ! నీయుపన్యాసముయొక్కసారాంశ మీ నాలుగుపజ్క్తులలోనే తెలిసినది. రామమోహనా ! తల యెత్తు. ఇక్కడఁ జూడు. భద్రము. ఇంక మీఁద నీవెప్పుడు నిట్లు చెప్పఁగూడదు. తెల్లవాఱఁ లేచి కాల్యకృత్యములను దీర్చికొని రాధాకృష్ణులను బూజింపవలయును. ఈవిగ్రహారాధన నేఁటిదా? తరతరాంతరములుగ వచ్చుచున్నది. మీతాతముత్తాత లందఱు నావిగ్రహములను బూజించిన వారే. వారికంటె నీవు బుద్ధిమంతుఁడవా ?

రా—(వినయముతో)

ఉ. ప్రాఁతది యంచు ధర్మమని♦పల్కఁగఁ జెల్లునె? చెల్లెఁబో భువిన్

బ్రాఁతదె విగ్రహార్చనము పామరకృత్యము వేదబాహ్యమీ
నూతనమైనదాని కిటు నొవ్వఁగ నేటికిఁ? దల్లి! యేక్రియన్
జూతును దీనిఁ బోనడఁపఁ జుట్టము పక్కము లెల్లఁ బాసినన్?

తా—రామమోహనా! తల్లిదండ్రులు దేవునివంటివారు కారా? వారు ప్రేమించువానిని నీవును ప్రేమించి పూజింపవలదా? నాయనా! నీ విట్లు పిచ్చిపిచ్చిమాటలాడి నా మనస్సు నేలఁ గలఁతఁ బెట్టెదవు? (అని రామమోహనుని గడ్డము పట్టుకొని వేఁడుచున్నది.)

రా—

ఉ. తల్లుల కెల్లఁ దల్లి యయి తండ్రులకున్ మఱి తానె తండ్రియై
యెల్లఱఁ బ్రోచుచుండు పరమేశ్వరుఁడంతటనిండియుండఁగా
నుల్లములందుఁ గన్గొనఁగ నొల్లక బొమ్మల మ్రొక్కుచుండఁగా
జెల్లునె ఖండనంబుఁ దగఁ జేయకయుండఁగఁ? దల్లి! చెప్పవే.

తా—ఛీ! మూర్ఖా! ఏలఁ బుట్టితివిరా నీవు నాకడుపులో? పాపీ! పో! వెళ్ళిపో! నీవు నాయింట నుండవద్దు. వెళ్ళిపో! పో! పో! పో! (అని తల మోదుకొనుచున్నది.)

[ఇది రామమోహనునితండ్రి యగురమాకాంతరాయి
విని వచ్చుచున్నాఁడు.]

ర—తారణీ! ఏమి? ఇదేమి?

తా—ఏ మున్నది? నేను నాఁడే చెప్పితిని. "తుఱకచదువు చెప్పింపవలదో చిన్నవాఁడు చెడిపోవును" అని. నామాట

వింటిరా? ఏల వినెదరు? కొంప యిట్లు మునిఁగిపోవలసి యుండఁగా మీ రేల వినెదరు?

ఆ. కడుపు చెఱుపంగఁ బుట్టెను; ♦ గొడుకుఁ గాఁడు
పెడతలను బుద్ధి పుట్టిన ♦ వీని నిపుడె
వెడలఁగొట్టుఁడు లేకున్న ♦ విషముత్రాగి
విడతుఁ బ్రాణంబు; సూనంబు ♦ విడువఁ గాని.

—రామమోహనా! ఏమి చేసినావు? చెప్పు.

రా—ఈపత్రిక చదివి వినిపించినాను.

—చదువు. అదేమి పత్రికో చదువు.

రా—ద్వి. చిత్రవిచిత్రమౌ ♦ సృష్టిఁ గన్గొనిన
మాత్రన యామహా ♦ మహు మహిమంబు
వెల్లడియగుచుండ ♦ విగ్రహములను
జెల్లునే పూజింప? ♦ స్నేహితులార!

తా—విన్నారా వానిమాటలు? చూచినారా వానికి వచ్చిన చేటు?

—(కోపముతో రామమోహనునిచేతిలోనికాగితము నూడఁ బెఱికికొని పరపరఁ జింపివేసి)

మీయమ్మ చెప్పినట్లు నడచుకొని యుంటివా ఉండు. లేదా వెళ్లు.

రా—

సీ. తల్లుల కెల్లఁదల్లి యయి♦తండ్రులకున్ మఱి తానె తండ్రియై

యెల్లఱుఁబో్రచుచుండుపర♦మేశ్వరుఁడంతటనిండియుండఁగా
నుల్లమునందుఁగన్గొనఁగ♦నొల్లకబొమ్మలఁ్రమొక్కుచుండఁగా
జెల్లునెఖండనమ్ముదగఁ♦జేయకయుండఁగఁ? దండ్రి! చెప్పవే.

ర—క. ఓరీ! పాపీ! పోరా!
ఓరీ! చండాల పోర ♦ యోతిమూర్ఖా!
యోక్రిపశువా! పోరా!
పోరానినుఁజూడ లేచి ♦ పోర కృతఘ్నా!
(అని గొంతుపట్టి గెంటుచున్నాఁడు.)

రా—(దూరముగా నిలువఁబడి)

సీ. నిలుకడమీఁదను ♦ నిజము కన్పడునట్లు
తెల్పఁ గప్పిన పొరఁ ♦ దీయువాఁడు
కోపసంతప్తులఁ ♦ గొంతకాలముమీఁదఁ
బరితప్తులుగ మార్చు ♦ పటిమవాఁడు
కీడులో వింతఁగాఁ ♦ గీల్గొల్పి మేలును
దివ్యసుఖమ్ములఁ ♦ దేల్చువాఁడు
సద్గుణాంకురములఁ ♦ జక్కఁగా నాటంగ
దుఃఖాళిచే మది ♦ దున్నువాఁడు
నిలిచి తా నొక్కతీరుగా ♦ వెలుఁగువాఁడు
గలఁడొకండు సమస్తంబుఁ ♦ గనెడువాఁడు
అతఁడు నడుపుత నన్నుఁ గృ♦పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

ర—వెళ్లు. మాటాడఁబోకు. వెళ్లు. (అని రామమోహనుని గెంటివేయు చున్నాఁడు.)



3 వ రంగము—కాశికానగరము. హరిశ్చంద్రఘట్టము.

(ధర్మపాలుఁ డనుబౌద్ధసన్న్యాసి ప్రవేశించు చున్నాఁడు.)

ధ—పరమపూజ్యుఁ డగుబుద్ధదేవుని జన్మస్థాన మగునార్యావర్తమందును దదితరదేశములందును అమ్మహానుభావుఁ డుపదేశించినధర్మం బెట్లు పరిణమించినదో చూడవలయు ననుకుతూహలముతో సింహళమునుండి బయలుదేరి యీదేశమందుఁ బలుచోట్ల సంచరించితిని. అమ్మహనీయుని పుణ్యచారిత్రం బెఱింగినవారు గాని యతఁ డుపదేశించిన పావనధర్మసారంబు దెలిసినవారు గాని యొక్కరైనను నా కంటికిఁ గనఁబడరైరి. వేయేల! ఆతనిపేరుగూడ విని యెఱుఁగనివా రెందఱో యున్నవారు.

ఉ. దేశహితైకకార్యనిరతిన్ శ్రమ నొందినవారికీర్తి యే
దేశమునందుఁ బాడ రది దేశ మనంగను జెల్లునే మతా
వేశముచేత మైమఱచి వీరులసచ్చరితంబు దాఁచినన్
దేశము వన్నెవాసి గని దివ్యసుఖంబులఁ దేజరిల్లునే?

విద్యానికేతన మని పేరువడసిన యీకాశికానగరమును గూడఁ బరిశోధించితిని. ఇక్కడను నదేవిధముగ నున్నది.

గొప్పగొప్పవిద్వాంసు లున్నారు గాని వారివిద్యమాత్రము సత్యాన్వేషణమున కుపయోగపడుచుండునట్లు కనఁబడదు. అయినను వారు వారు నేర్చినయభిమానశాస్త్రములను శిష్యుల కుచితముగాఁ గఱపుచుండు వారియౌదార్యము మాత్రము మిక్కిలి ప్రశంసనీయము. ఈపట్టణము హిందువులందఱిచేతను బవిత్రయాత్రాస్థలముగఁ బ్రాచీనకాలము నుండియుఁ బరిగణింపఁ బడుచున్నది. ప్రతిదినమును వేల కొలఁది యాత్రికులు ఈదివ్యక్షేత్రమును సేవింప నలుగడల నుండి వచ్చుచుందురు. ఇందు యాత్రికులకును విద్యార్థులకును భోజన ముచితముగా నిడుధర్మసత్రంబు లనేకంబులు గలవు. కాని ఇవి దృఢగాత్రు లయినసోమరిపోతులకును బాపపరాయణులకును గూడ శరణ్యములుగఁ బరిణమించు చున్నవి. మానవనిర్మితం బైనప్రతికార్యమునందును నేదో యొకలోపం బుండక మానదు గదా. ఏ దెట్లుండినను శ్రద్ధాభక్తులు మాత్రము హిందువుల నింకను వదల లేదనుట నిస్సంశయము. కాఁబట్టి యమాయిక మగుజన సామాన్యముతో బుద్ధదేవుని పవిత్రచరిత్రను గూర్చి కొంత ముచ్చటించి మఱి వెళ్లెదను.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

(రామమోహనుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

రా — (కాశికాపురివంకఁ జూచి) నాహృదయక్షేత్రమందు

జ్ఞానాంకురమును నాటిన కాశికానగరరాజమా! మఱల నిను జూచుభాగ్యంబు నాకుఁ గలిగినందులకు నే నెంతయు సంతసిల్లు చున్నాఁడను.

(గంగానదికేసి దృష్టి పఱచి) ఓభాగీరథీ! కేవలము పరోపకారనిమిత్తము నిన్నీధరణికిఁ దెచ్చినమహాత్ముని నిరంతరము నీనామంబుచే స్మరింపఁ జేయు చుందువు. నీవంటి కృతజ్ఞులు మ ఱెవ్వ రుందురు? అదియునుం గాక

గీ. పరులకై జీవనంబును ♦ బంచి పెట్టి
వడిగఁ బరువెత్తి సుగుణాబ్ధి ♦ వరునిఁ గూడి
నామరూపములను బాసి ♦ నవ్వుచుండు
నీచరిత్రంబ దెంతయు ♦ నిర్మలంబు.

(హరిశ్చంద్రఘట్టము నవలోకించి) ఓఘట్టరాజమా!

గీ. సత్యమునకయి సర్వ మే ♦ చక్రవర్తి
ధారవోసెనో యాపుణ్య ♦ ధన్యకీర్తి
సతతమును వేయినోళ్లను ♦ జాటుచుండు
నిన్నుఁ గేవలజడముగా ♦ నెన్నఁ దగునె?

(తెరలో) ఓధర్మానురాగు లయినసహోదరులారా!

(అని వినఁబడుచున్నది.)

రా—అదిగో! ఎవరో ధర్మోపన్యాస మొనరించు చున్నవారు. పోయి యాలకించెదను. (అని నిష్క్రమించు చున్నాఁడు.)



4 వ రంగము—కాశికానగరము. రాజవీథి.

(జనులయెదుట ధర్మపాలుఁ డుపన్యసించు చుండఁగా రామమోహనుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

ధ—ఓధర్మానురాగు లైనసహోదరులారా! నాది సింహళ దేశము. నేను బరమపూజ్యుఁ డగుబుద్ధదేవుఁ డుపదేశించిన ధర్మము నవలంబించినవాఁడను. బుద్ధదేవుఁ డెవరో మీకుఁ దెలియునా?

ఒకఁడు—మాకుఁ దెలియదు. దయచేసి చెప్పుఁడు.

ధ—మీయందే పుట్టి మీయందే పెరిఁగి మీకొఱకే సమస్తము నర్పించిన యమ్మహాత్ముని మీరే మఱచితిరా?

మఱియొకఁడు—మాయందుఁ బుట్టెనా? ఎప్పుడు పుట్టెను? ఎచ్చటఁ బుట్టెను?

ధ—ఇరువదిశతాబ్దములకుఁ బూర్వము ఈకాశికానగరమునకు సమీపమునఁ గపిలవస్తు వనునొకపురం బుండెను. దానిని శుద్ధోదనుఁ డనుమహారాజు పరిపాలించు చుండెను. అతనికి నిమ్మహనీయుఁ డుదయించెను.

ఇంకొకఁడు—ఓహో! ఇతఁడు మాదేశపు రాజకుమారుఁడా? తరువాత.

ధ-అప్పుడు యజ్ఞములకయి కొందఱును బలులకై కొందఱును మృగయా వినోదమునకయి కొందఱును నోరెఱుఁగని బిడ్డలవంటిపశువులను గరుణావిహీను లై చంపుచు నార్యా

వర్త్తము సంతను ఘోరనరకంబుగ మార్చు చుండిరి.

రా—ఇప్పుడు మాత్రము వదలి పెట్టినారా? తరువాత

ధ—ఉ. జవ్వనముఁ సురూపమును ♦ సద్గుణముంగలపత్నినందుపై
మవ్వపుముద్దులొల్కుసుకు ♦ మారుఁగుమారునినంతెకాకదా
దవ్వుల నివ్వటిల్లు తన ♦ దండిప్రభుత్వము నెల్ల వీడెఁ దా
నెవ్వికైనైనఁ బాపమగు ♦ హింసను బాపఁగబుద్ధుఁడుర్విలోన్.

రా—ఆహా! యెంతటి మహానుభావుఁడు.

ధ—అ ప్పరమపూజ్యునిచరిత్ర యంతయు సంస్కృతమందును బాలిభాషయందును సవిస్తరముగ వ్రాయఁబడి యున్నది. వానిం జదివి బుద్ధుని శరణంబు చొచ్చి యతఁడుపదేశించిన ధర్మ్మం బనుష్ఠించి కృతార్థులు గండు. ధర్మ్మము వర్ధిల్లును గాక. సత్యము జయించును గాక.

(అని పోఁ బోవుచుండఁగా రామమోహనుఁడు సమీపించి)

రా—యతివరా! ఆగ్రహంబున నాతలిదండ్రులు నను నిలు వెడలఁ గొట్టిరి. వారి కనుగ్రహంబు గలుగువఱకు మిము బోటి పెద్దలసాంగత్యంబున సత్యాందోళనంబునఁ గాలంబు గడపవలె ననుకుతూహలంబుతో నున్నవాఁడను. ఈశ్వ రానుగ్రహంబున మీదర్శనంబు నాకు లభియించెను. నన్ను మీవెంటఁ గొని చనియెదరా? పాలిభాషను మీయొద్ద నభ్యసించి బుద్ధదేవుని ధర్మోపదేశంబుల నెఱింగి కృతార్థుఁడ నయ్యెదను.

ధ—(తనలో) ఈతఁడు మొదటినుండి నాయుపన్యాసమును శ్రద్ధతో వినుచుండెను. ఇతని హృదయంబు ధర్మాం దోళనమందు లగ్నంబై యున్నయది. సుక్షేత్రంబు లభించినపుడు ధర్మాంకురంబుల నవశ్యంబు నాటవలయును గదా. (ప్రకాశముగా) నాయనా! రమ్ము. అవశ్యముగా రమ్ము. మనము హిమవత్పర్వతముమీఁదుగాఁ దిబ్బిష్ట పమునకుఁ (టిబెట్టునకు) బోవుదము.

(అని యిర్వురు నిష్క్రమించుచున్నారు.)



5 వ రంగము—హిమవత్పర్వతప్రాంతము.

(రామమోహనుఁడును ధర్మపాలుఁడును ప్రవేశించుచున్నారు.)

ధ—నాయనా! రామమోహనా! హిమవత్పర్వతమును జూచితివా?

రా—స్వామీ! చూచితిని. నాకనులు ధన్యము లయ్యెను.

సీ. రవిరశ్ములివముపైఁ ♦ బ్రతిఫలించుటఁ జేసి
రత్నాలకాంతుల ♦ రహి వహింప
నెండకై కరఁగిన ♦ హిమఖండములు మంచి
పులకండములఁ బోలి ♦ పొలుపు నింప
జాలుబండలనుండి ♦ జాలుబాలురమాడ్కి
మంచుగడ్డలు దొర్లి ♦ మహికి డొల్ల

నింగిలోనికి నిక్కి ♦ నెగడిన శిఖరముల్
మొగిలుమొత్తములలో ♦ మూసి పోవ
మించు నీమంచుకొండను ♦ గాంచఁ గల్గెఁ
దండ్రి నను నిలు వెడలంగఁ ♦ దఱిమినట్టి
కారణంబున సర్వేశు ♦ కరుణకతన
నిర్మలానందలోల ! యో ♦ ధర్మపాల !

ధ—అంతే కాదు.

సీ. ఆవలిచలిగాలి ♦ యీవల రాకుండఁ
దీరిచి కట్టిన ♦ తెర యనంగ
వర్ష మేఘాళి యీ ♦ వల దాఁటి పోకుండ
నెత్తుగా నెత్తిన ♦ భిత్తి యనఁగ
దండెత్తి యీవంక ♦ దాయలు రాకుండ
వరుస నిర్మించిన ♦ వప్ర మనఁగ
నీరసారమ్ముల ♦ నేర్పుతోఁ జేరిచి
కూర్చిన యక్షయ ♦ కోశ మనఁగ
వఱలునీశైలరాజ మీ ♦ భరతభూమి
కెంత మేలొడగూర్చునో ♦ యెఱుఁగఁ దరమె
యద్భుతము సృష్టివైచిత్ర్య ♦ మద్భుతంబు
రామమోహన ! సద్గుణ ♦ రాజిసదన !

రా—ఆహా ! యెంతటిపర్వతరాజమును బరమేశ్వరుఁ డీ యార్యావర్తమునకుఁ బ్రసాదించి యున్నవాఁడు ! ఏమి

యాతని కరుణావిశేషము! ఇటు చూడుఁడు!

ఉ. చిత్రవిశాలవృక్షములు ♦ చిత్రవిచిత్రలతావిశేషముల్
చిత్రవిహంగముల్ మఱియుఁ ♦ జిత్రమృగంబులు చిత్ర
[వాహినుల్
చిత్రసరంబులుం గలిగి ♦ చిత్రము లీశ్వరుఁడైపుఁ ద్రిప్పు నీ
చిత్రహిమాద్రికాననము ♦ చెన్నలరారెడు నేత్రపర్వమై.

గీ. చేరి యెవ రీవనాంతర ♦ సీమ నీశు
ధ్యాన మొనరించి యేకాగ్ర ♦ మానసమున
సద్భుతానందముల నోల ♦ లాడుచుంద్రు
వారె ధన్యులు యతివరా! ♦ వసుధయందు.

ధ—(తనలో) ఇ మ్మహాత్ముఁడు మూర్తీభవించిన భక్తివలెఁ బ్రకాశించుచున్నవాఁడు. ఇట్టి సత్పుత్రుని దలిదండ్రు లేల నిలువెడలఁ గొట్టిరో కదా. (ప్రకాశముగా) రామమోహనా! నీతలిదండ్రులు నిన్నేల దఱిమివేసిరి?

రా— ద్విపద.

చిత్రవిచిత్ర మా ♦ సృష్టి గన్గొనిన
మాత్రన యామహా ♦ మహుమహిమంబు
వెల్లడి యగుచుండ ♦ విగ్రహములను
జెల్లునే పూజింప ♦ స్నేహితులార!

అని జనులకు నేను బోధించుటవలన.

ధ—(తనలో) ఈతనిమాటలవలన నాహృదయము కూడ

మాఱిపోవు చున్నయది. నే నింతవఱకు బుద్ధునే దేవునిగ భావించుచుంటిని. చిత్రవిచిత్ర మైనయీసృష్టికిని బుద్ధునకును మూలకారణ మైన యొకమహాశక్తి యుండియే తీరవలె నని నాకుఁ దోఁచు చున్నయది. (ప్రకాశముగ) నాయనా! రామమోహనా! నడువుము. ఈకనుమలమీఁదుగఁ ద్రివిష్టపమునకుఁ బోవుదము. (ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)



6 వ రంగము—త్రివిష్టపము. లాసానగరము.

(ధర్మపాలుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

ధ—అత్యున్నత మైనయీత్రివిష్టపం బెంతశీతప్రదేశ మైనను విచిత్రదృశ్యంబులు గలిగి మిక్కిలి రమణీయ మగుటచే రామమోహనునిచిత్తంబు నెంతయు నాకర్షించినది. అతనికి సాధు వనునొకవర్తకునియింట బస కుదిరించితిని. ఆగృహిణి యగుసుజాత పరమసుగుణోపేత. అతనిని దనపిల్లలలో నొక్కనిగఁ జూచుకొందు నని సెలవిచ్చినది. పాలిభాష నంతను నొక్కమాసములో నేర్చుకొనె నన్న నారామమోహనుని ప్రజ్ఞావిశేషము నే మనవచ్చును? అతనికి బుద్ధునియం దనురక్తి కలుగుటకును నాకు భగవంతునియందు భక్తి కలుగుటకును మాపరస్పరసమాగమమే కారణ మయ్యెను. ఇక్కడి బౌద్ధగురువు లగులామాలు తాము

బుద్ధునియవతారంబు లని జనులను మోసపుచ్చి బుద్ధుని దంతం బని యొకదంతము నొక్కపీఠంబుపై నుంచి ఛత్ర చామరపుష్పంబులచే నలంకరించి పూజించుచు నమాయికు లగుజనులు సమర్పించుకానుకల గ్రహియించి మదోన్మత్తులై సంచరించు చున్నవారు.

గీ. శైలసంజాతసురనదీ ♦ స్వచ్ఛజలము
పోయినకొలంది మలిన మై ♦ పోవుకరణి
సుజనసుహృదయసంజాత ♦ శుద్ధమతము
పోయినకొలంది మలిన మై ♦ పోవు ధరణి.

ఇంకఁ జీనా మొదలగుదేశంబులస్థితి యెట్లున్నదో కనుఁగొని సింహళంబునకుఁ బోయెదను.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)



### 7 వ రంగము—బౌద్ధదేవాలయము.

(ఉన్నతపీఠంబుపై బుద్ధునిదంత మలంకరించి యుంచి యిరుగడలఁ బీఠంబులపై బుద్ధగురువు లగులామాలు కూర్చుండి యుండఁగా రామమోహనుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

రా—గీ. సర్వసద్గుణసంపన్న ♦ సతిని వీడె
ముద్దులొల్కెడుసుకుమారుఁ ♦ బుత్రు వీడె
ఘనతరం బగుతనదార ♦ తనము వీడె

దయను నెఱపంగ బుద్ధుండు ♦ ధర్మరతుఁడు.

పెద్దలామా—ఓహో! ఎవ్వరో పరమపూజ్యులగుమనబుద్ధ దేవుని బొగడు చున్నవారు.

చిన్నలామా—ఏదయ్యా! మ ఱొక్కసారి వినిపింపుము.

రా—గీ. సర్వసద్గుణసంపన్న ♦ సతిని వీడె
ముద్దులొల్కెడుసుకుమారుఁ ♦ బుత్రు వీడె
ఘనతరం బగుతనదొర ♦ తనము వీడె
దయను నెఱపంగ బుద్ధుఁ డు ♦ దారగుణుఁడు.

పె. లా—సెబాసు! రావయ్యా! సమీపమునకు రా. ఎవఁ డక్కడ? ఇతని కొక పీఠమును దెమ్ము.

(సేవకుఁడు పీఠముఁ దెచ్చి రామమోహనుని గూర్చుండఁ బెట్టుచున్నాఁడు.)

పె. లా—అయ్యా! మీదేశ మెద్ది? నీపే రేమి?

రా—మాదేశము ఆర్యావర్తము. నాపేరు రామమోహనుఁడు.

పె. లా—కాఁబట్టియే ముఖమున నాతేజస్సు!

చి. లా—తేజస్సే కాదు. అతనివాగ్ధోరణియు నట్టిదే.

పె. లా—ఏది యిప్పుడు వచించినది మఱియొకసారి సెలవిమ్ము.

రా—గీ. సర్వసద్గుణసంపన్న ♦ సతిని వీడె
ముద్దులొల్కెడుసుకుమారుఁ ♦ బుత్రు వీడె
ఘనతరం బగుతనదొర ♦ తనము వీడె
దయను నెఱపంగ బుద్ధుండు ♦ ధన్యతముఁడు.

పె. లా—ధన్యతముఁడె! నిజముగా ధన్యతముఁడె. ఎవరక్కడ! ఒకసాలువుఁ దెచ్చి యితనికిఁ గప్పుము.

సేవకుఁడు—చిత్తము. (అని యట్లే చేయుచున్నాఁడు.)

రా—అంతయు సరే కాని

గీ. అట్టిబుద్ధుని భక్తులై ♦ యలరికూడ
నతఁడు మీ రయిపుట్టిన ♦ యట్లు చెప్పి
మూఢులై నట్టిజనులను ♦ మోసపుచ్చి
యర్థ్యఁ గొనుచుంట మీ కిది ♦ యర్హ మగునె.

పె. లా—ఎవ రక్కడ! ఇతనిఁ దక్షిణమే యావలికిఁ ద్రోసి వేయుము.

చి. లా—పైఁ గప్పినసాలువును దీసికొని మఱిగెంటివేయుము.

సే—(అట్లే చేసి వచ్చి) స్వామీ! వీఁడు పయోముఖవిషకుంభము. వీనినూరక విడచిపెట్టుట శ్రేయస్కరముకాదు. మీసెలవైనయెడల నాచూపులు మెఱుములై మెఱయ నాయఱుపు లుఱుములై యుఱుమ నాపిడికిలిదెబ్బలు పిడుగులై గురియ నొకనిముసములో వీనిఁ గడతేర్చి వచ్చెదను.

పె. లా—భృత్యా! నీస్వామిభక్తి కెంతయు మెచ్చుకొంటిమి. (నలుగడలు చూచి) ఎవరు లేరు కదా! భృత్యా! దగ్గఱకు రమ్ము. (అని చెవిలో) ఎవరికిని దెలియకుండ రహస్యముగా వానిని జంపవలయును. (బిగ్గఱఁగా) పొమ్ము.

నీకార్యము నెఱవేఱును గాక. బుద్ధుఁడు దోడ్పడును గాక. శ్రేష్ఠచిత్తము. సెలవు గైకొనెదను.

(అని నిష్క్రమించును.)

(ఇది యంతయుఁ బొంచి వినుచున్నయొకస్త్రీ)

(తనలో) ఆహా! పాపమునకుఁ గూడ బుద్ధుఁడు తోడ్పడునా? ఏమి వీరిమౌర్ఖ్యము. దయాస్వరూపుఁ డగుబుద్ధుఁ డెక్కడ? ఘోరహత్యలకుఁ గూడ వెనుదీయని యీక్రూరగురువు లెక్కడ? ఇట్టి స్వార్థులచేతనే కదా యార్యావర్తమునఁ బరిశుద్ధ మైనబౌద్ధమతమునకు హాని కలిగినది.

గీ. హితము నహితముగా మార్చి ♦ మతికిఁ జూపు
శాంతమును నాశ మొనరించు ♦ సాంతముగను
జేయరానట్టి పనులను ♦ జేయఁ గొలుపు
స్వార్థమునకంటెఁ బాపంబు ♦ జగతిఁ గలదె?

“యథార్థవాది లోకవిరోధి” యనునది యెంతో యనుభవముమీఁదఁ జెప్పినమాట కదా. పాపము! సత్యమే చెప్పిన యారామమోహానుని నీమూర్ఖులు గడతేర్ప నెంచి యున్నారు.

గీ. పాలు వోసినఁ గోలేదని ♦ బాములకును
విషమె వర్ధిల్లు నట్టులే ♦ పృథ్వియందు
మూర్ఖులకు మేలునే కోరి ♦ బుద్ధి సెప్ప
నలుకయే కాని శాంతంబు ♦ కలుగ దెపుడు.

నేను వడిగాఁ బోయి యీసంగతిని నామిత్రురాలగు సుజాత కెఱింగించెదను. (అని నిష్క్రమించును.)



8 వ రంగము—సుజాత గృహము.

(సుజాతయు రామమోహనుఁడు ప్రవేశించుచున్నారు.)

సు—నాయనా! రామమోహనా! నీ వేల యూరకుండక యీమూర్ఖులను గెరలించితివి? వీరికి బౌద్ధగురువు లనిపేరే కాని యమ్మహాత్ముని సుగుణములలో నొక్కటైనను వీరి యందుఁ గాన రాదు. ధర్మపాలుఁడు వెడలి పోవునపుడు ని న్నెంతో మెలఁకువతోఁ గాపాడవలె నని మాటిమాటికిఁ జెప్పి నా కప్పగించి పోయెను. తండ్రీ! నే నేమి చేయుదును? నిన్నుఁ బొరిగొనవలె నని యీగురువులు ప్రయత్నించుచున్నా రఁట. ఆమాట విన్నప్పటినుండియు నాయొడలు గంప మెత్తుచున్నయది. రామమోహనా! నీ విచ్చట నుండినఁ దప్పక కీడు మూడియే తీరును. కావున నామాట విని తక్షణమే మీదేశమునకు వెడలి పొమ్ము. నీకుఁ గావలసినసదుపాయముల నంతను నేను జేసి పంపెదను. కృపాళు వగుబుద్ధుఁడు నిన్ను రక్షించునుగాక. నాయనా! పొమ్ము. శీఘ్రముగా వెడలి పొమ్ము.

రా—గీ. నీకె యింతటిదయ యుండ ♦ నిఖిలజగముఁ

గాచువానికి నాయందుఁ ♦ గరుణ లేదె?
యతని శరణంబు చొచ్చిన ♦ నతఁడె కాచు
మాతరో! కావకుండిన ♦ మఱియు మేలు.

సు—నాయనా! రామమోహనా! సాహసము సేయకుము. సాహసము సేయకుము. నన్ను సంతోషపఱచుట కైనను నామాటను వినుము. పొమ్ము నాయనా! వెడలి పొమ్ము. నీవు వెడలి పోయినంగాని నామనసు కుదుటఁ బడదు.

రా—(తనలో) ఆహా! స్త్రీలచిత్త మెంత మెత్తనిది! ఈ సుజాతయొక్క హృదయములోఁ బరమకరుణాళు వగుపరమేశ్వరుఁడు తాండవము సల్పుచున్నాఁడు. ఈమెమాటలు భగవంతునియాదేశమువలె నాహృదయమునకుఁ దోఁచుచున్నయవి. కాఁబట్టి యీమెచెప్పినట్లే చేసెదను. (ప్రకాశముగ) అమ్మా! నీయాజ్ఞను శిరసావహించెదను.

ఆ. తల్లి! నీవు నాకుఁ ♦ దయతోడఁ జేసిన
హితము మరువ మరువ ♦ నీకు నెంచి
చేతనైనయంత ♦ చేసెద నుపకృతి
స్త్రీలవెత లొకింత ♦ తీరు నట్లు.

ఇది ప్రథమాంకము.



# రామమోహననాటకము.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము—గంగాతీరము.

(రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—సీ. బుద్ధదేవునిపరి ♦ శుద్ధచారిత్రంబు
వీనులవిందుగా ♦ వినిచె నాకు
శీతనగేంద్రుని ♦ చే నగులాభముల్
తేటతెల్లంబుగాఁ ♦ దెలిపె నాకు
స్వార్థంబె జగతిని ♦ సర్వవిధంబులఁ
బాపమూలం బని ♦ చూపె నాకుఁ
గాంతామతల్లుల ♦ కరుణార్ద్రమై యొప్పు
హృదయ మెట్టిదో యెఱిఁ ♦ గించె నాకు
నెనరు లేనట్టిహృదయంబు ♦ నిష్ఫలంబు
తెలియు మంచని మదిని బో ♦ ధించె నాకు
నఖిలసద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

ఇదిగో! మఱల మజ్జన్మభూమి యగుపవిత్రమైన యార్యా

వర్తమును బ్రవేశించితిని. ఆహా! గంగాభవాని నాకన్నుల కెంత యానందమును గొలుపుచున్నయది. ఈపావన స్వరూప యగుభాగీరథిని నేమని వర్ణింతును!

సీ. ఆర్యభూమీందిర ♦ యతులిత ధరించిన
యాణిముత్తెమ్ముల ♦ హార మొక్కొ
భరతఖండపుమహా ♦ ద్వారసీమను బొల్చు
రమణీయతోరణ ♦ రాజ మొక్కొ
అబ్ధిశీతాద్రుల ♦ యన్యోన్యవార్తలఁ
దెచ్చి పుచ్చుచు నుండు ♦ తీఁగె యొక్కొ
మందశీతానిలం ♦ బందమ్ముగా నెక్కి
లీలతో నూఁగు ను ♦ య్యేల యొక్కొ
కరవురక్కసు సరసర ♦ నఱికివైచి
యలరు పరమాత్ము శితచంద్ర ♦ హాస మొక్కొ
యనఁగ నొప్పారు చున్నది ♦ యద్భుతముగ
నదులకెల్లను రాణి గం ♦ గాభవాని.

(తెరలో)

హా పరమేశ్వరా! పరమేశ్వరా!!

(అని వినఁబడుచున్నది.)

రా—(ఆలకించి) ఎవరో మానినీమణి విలపించుచున్నట్లున్నది. పోయి కనుఁగొనియెదను. (అని నిష్క్రమించును.)



2 వ రంగము—గంగాతీరము. శ్మశానము.

(సహగమన మొనర్చినతనపుత్రిని దలంచుకొని విలపించుచు వకుళయు, రామమోహనుఁడును బ్రవేశించుచున్నారు.)

వ—హా! పరమేశ్వరా! పరమేశ్వరా!!

రా—అమ్మా! ఏలయేడ్చెదవు?

వ—నాయనా! నే నేమి చెప్పుదును?

శా. అయ్యో! చూచుచుండ నాప్రియసుతన్ ♦
హాయగ్నిలో వైచిరే!
యయ్యార్తధ్వని సోకకుండఁ జెవికిన్ ♦
హా! భేరి మ్రోయించిరే!
అయ్యో! మంటల కోడి కాళ్లఁబడినన్ ♦
హా! దీర్ఘకాష్ఠంబులన్
గుయ్యో మొఱ్ఱో యనంగఁ గ్రుచ్చి మఱలన్ ♦
గూతుం జితిన్ ద్రోసిరే!

రా—అయ్యో! ఎంతటి క్రూరులు! ఎంతటి క్రూరులు!

వ—ఉ. ఒక్కరికేని నించుకయు ♦ నుల్లములో దయలేకపోయెనే
మక్కువఁ గన్నమాతనను ♦ మత్సుతఁ జేరఁగనీక త్రోసిరే
యెక్కడి సాగుమాన మిది ♦ యేకఠినాత్ముఁడు గల్గఁజేసెనో
యక్కట! రాముమాతలకు ♦ నప్పుడు లేనిది దెట్లువచ్చెనో!

రా—అమ్మా! ఊరడిల్లుము. ఊరడిల్లుము.

వ—నాయనా! పదియాఱేండ్లుగూడఁ బూర్తిగ నిండని నా

యొక్కతే కౌమార్తెకు నీగతి పట్టఁగాఁ గన్నులారఁ జూచి నే నెట్లోర్చి యుండుదు. నా కెక్కడి శాంతి. హా! పరమేశ్వరా! పరమేశ్వరా!! (యని మూర్ఛిల్లుచున్నది.)

రా—కన్నకడుపు గానఁ బొరలిపొరలి వచ్చు నీమెదుఃఖమును నెవ్వ రాపఁగలరు? కాలమే నివారింపవలయును. అహా! సహగమన మెంతటిఘోరకృత్యము!

సీ. తల్లిదండ్రులు మఱేఁ • దఱిమివేయఁగ నిమ్ము
చుట్టాలు నను నెలిఁ • బెట్ట నిమ్ము
నెచ్చెలుల్ నామీఁది • నెమ్మి వీడఁగ నిమ్ము
గిట్టక పామరుల్ • దిట్ట నిమ్ము
ప్రభువులే యొకవేళ • బాధింపఁగా నిమ్ము
పండితమ్మన్యులు • మండ నిమ్ము
కష్టమ్ములెల్లను • గడఁగి పైఁ బడ నిమ్ము
దుష్టులు దలఁ ద్రుంపఁ • దొడర నిమ్ము
ఓపరాత్పర! నీదయ • యున్నఁ జాలు
ఘోర మైనట్టియీదురా • చార మడఁతు
నఖిలసద్గుణమూర్తి కృ • పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక • చక్రవర్తి.

(అని నిష్క్రమించును.)



---

3 వ రంగము—గంగాతీరము.

(రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—(ఆకసమువంకఁ జూచి)

గీ. పాపములనెల్ల నణఁమాడి ♦ ప్రబల మైన
బ్రహ్మతేజంబుతో నొప్పు ♦ భక్తమాడ్కిఁ
జీఁకటులనెల్ల నణఁమాడి ♦ చిత్ర మైన
భద్రతేజంబుతో నొప్పె ♦ భాస్కరుండు.

మఱియును,

గీ. వంశమున కెల్లఁ దనప్రభా ♦ వమ్ముచేత
వన్నె యిడి వెల్గుకులమణి ♦ వలెను ద్యుమణి
విశ్వమున కెల్లఁ దనప్రభా ♦ వితతిచేత
వన్నెయిడి తద్దయును వెల్గు ♦ చున్నవాఁడు.

మధ్యాహ్నము కావచ్చినది. సమీపమున గ్రామమున్నట్లు తోఁచుచున్నది. పోయి కొంతసేపు విశ్రమించెదను.

(అని పోవుచుండఁగాఁ దెరలో)

హాపరమేశ్వరా! పరమేశ్వరా! (అని వినఁబడుచున్నది.)

రా—(చెవి యొగ్గి విని) ఏమి యీయార్తనాదము? ఇచటఁ గూడ సహగమనము జరుగుచున్నదా? ఏమి? ఏఘోర వార్తను వినవలసి వచ్చునో యని నాగుండెలు దటతటఁ గొట్టుకొనుచున్నయవి. త్వరగాఁ బోయి కనుఁగొనియెదను.

(అని నిష్క్రమించును.)

4 రంగము—గంగాతీరము. మడువు.

(ఆచారమును బట్టి గంగలోఁ దొలిచూలును వైచి విలపించు శాంతయు రామమోహనుఁడును బ్రవేశించు చున్నారు.)

శాం—హా పరమేశ్వరా! పరమేశ్వరా!

రా—అమ్మా! ఏల విలపించెదవు?

శాం—నాయనా!

సీ. కంట నీ ర్వెట్టక ♦ కడువేడ్కఁ దొలిచూలు
నిడుగంగ నని యత్త ♦ పొడిచి చెప్పఁ
దక్కినపిల్లలు ♦ దక్కుదు రిది సేయ
నిక్కమం చని చెలుల్ ♦ నొక్కి చెప్ప
లగ్నంబు మించిన ♦ లగ్గు గా దనుచును
సారెకు విప్రుండు ♦ చేరి చెప్ప
నమ్మరో! వల దని ♦ యతిదీనవాక్యాళి
నాత్మలోపల నంత ♦ రాత్మ సెప్ప
మొసలివాతను నేఁ గన్న ♦ ముద్దులొల్క
పట్టి నిడినట్టిపరమదౌ ♦ ర్భాగ్యురాల
శిష్టులకు దూర మైనట్టి ♦ దుష్టురాల
చూడఁ బోకుము నామోము ♦ చూడఁ బోకు.

చేతులార నాచిన్నిపాపని దెచ్చి యీగంగలో వైచితినే. ఉత్త చేతులతో నే నెట్టు లింటికిఁ బోదును? హా పరమేశ్వరా!

(అని మూర్ఛిల్లుచున్నది.)

రా__అహా! ఎంతటిఘోరకృత్యము! ఎంతటిఘోరకృత్యము!
దేశ మెంత యధోగతిపాలైనది!

సీ. తిన వేళ్లఁ బసులను ♦ దెగఁజంపు పాపియుఁ
బుత్రుని జంపంగఁ ♦ బూనఁ డెపుడు
మద్యపానము చేసి ♦ మతి చెడుపాపియుఁ
బుత్రుని జంపంగఁ ♦ బూనఁ డెపుడు
దోపిడి గొనుమహా ♦ ద్రోహి యౌపాపియుఁ
బుత్రుని జంపంగఁ ♦ బూనఁ డెపుడు
పరభామలను బట్టు ♦ పరమపాతకుఁడును
బుత్రుని జంపంగఁ ♦ బూనఁ డెపుడు
కన్నతల్లియె పుత్రుని ♦ గంగ నిడియె
నీ దురాచారమును బాప ♦ నేని జగతి
నేను బుట్టినఫలమె? కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

(అని నిష్క్రమించును.)



5 వ రంగము__గంగాతీరము.

(రామమోహనుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

రా__(దివికి దృష్టిఁ బఱపి)

గీ. అంబరేందిర విభునిపై ♦ నమలభక్తిఁ

గరమునం గొని యమృతంబు ♦ గురియుచున్న
రజతకలశంబొ నా నొప్పి ♦ (కాలె దివిని
బూర్ణచంద్రుండు భువనస ♦ మ్మోహనుండు.

మఱియును,

గీ, తపనుకిరణాళిచేతను ♦ దల్లడిలిన
నవని నోదార్ప జగదీశుఁ ♦ డంపినట్టి
దూతయో నాఁగ మింటను ♦ దోఁచినాఁడు
శీతకరుఁ డదె లోకసం ♦ (ప్రీతికరుఁడు.

అదిగో! నాకనఁబడుగ్రామములో నేదో జాతర జరుగుచున్న ట్లున్నది. జనుల కలకల మిచ్చటికి వినవచ్చుచున్నది. కాని యీప్రదేశ మేకాంతముగా నుండుటచేత నీప్రశాంతసమయమునందుఁ బరమేశుని ధ్యానించుట కెంతయు ననువుగా నున్నది. కాఁబట్టి యిచటఁ గూర్చుండి కొంతసేపు భగవంతుని ధ్యానించి మఱి గ్రామములోనికిఁ బోయెదను. (అని కూర్చుండును.)

(తెరలో) ‘నఱుకు! ఒకదెబ్బతో నఱుకు! హా! మహాంకాళి! హాకాళి! హాకరాళి!’ (అని వినఁబడుచున్నది.)

రా—(విని తటాలున లేచి) అయ్యో! పాప మేదో మూఁగజంతువును గాళికి బలి యిచ్చిన ట్లున్నది. తక్కినవానినైన నాఁపుట కగునేమో పోయి చూచెదను.

(అని నిష్క్రమించును.)

6 వ రంగము—కాళికాలయము.

(పూజారి మొదలగువారు నఱకఁబడిన యొకనరునితలను గాళికావిగ్రహసమీపమందుఁ బెట్టి తప్పెట్లు వాయించుచుఁ గేకలు వేయుచుండఁగా నించుక దూరమున రామ మోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—(తనలో) అయ్యో! తోడిమానవునే బలి యిచ్చినారు. వీరింకేఘోరకృత్యమునకు వెనుదీయుదురు? తప్పెట్లు వాయించుచుండువీరికి నాయుపదేశ మేమి పనికి వచ్చును?

సీ. కారుణ్యమూర్తి వై ♦ కాలెడునీ వేడ
క్రౌర్యస్వరూప యీ ♦ కాళి యేడ
పాపముల్ పోఁద్రోలు ♦ భవ్యుఁడ వీ వేడ
దురితముల్ గొల్చునీ ♦ దుర్గ యేడ
జగములఁ గలిగించు ♦ చైతన్య మీ వేడ
ప్రాణమే లేనియీ ♦ ప్రతిమ యేడ
తేజోనిధాన మై ♦ రాజిల్లు నీ వేడ
మలినప్రధాన మీ ♦ శిల యి దేడ
విగ్రహమ్ముల నర్చించు ♦ వెఱ్ఱి మాన్పి
నిన్నుఁ బూజింప జనులకు ♦ నేర్ప కున్న
నకట! యీఘోరకృత్యమ్ము ♦ లడఁగు టేడ
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

(అని నిష్క్రమించును.)

7 వ రంగము—రాధానగరము.

(రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—(తనలో) ఈశ్వరానుగ్రహంబున స్వగ్రామం బగురాధా నగరమును మఱలఁ బ్రవేశింపఁ గలిగితిని. సంస్కృతమును జదివి హిందూమతమును, పాలీభాషను బఠించి బౌద్ధమత మును, అరబ్బీ నభ్యసించి మహామ్మదీయమతమును బరిశీ లించితిని. ఇంకహిబ్రూ, గ్రీక్కు, ల్యాటిన్ భాషల నెఱింగి క్రైస్తవమతమును బరికింపవలయును. అంగ్లభాషలోఁ బాండిత్య మలవఱచుకొని ప్రస్తుతము మనదేశము నేలు చుండు నాంగ్లేయదొరతనమువారితోఁ బరిచయము గలి గించుకొనవలయును. స్వతంత్రముగను గౌరవముగను జీవించుటకుఁ దగినసదుపాయమును గల్పించుకొనవలయును. ఈదేశమందుఁబ్రబలియుండుఘోరదురాచారములనన్నిఁటిని రూపు మాపవలయును. అందఱియందును బరస్పరప్రేమాను బంధంబు గలిగించి భూతలంబును స్వర్గంబుగ మార్చుటకుఁ బరిశుద్ధమైనయేకేశ్వరోపాసనమును నెలకొల్పవలయును. ఈయావిషయంబులం దనక దేశోద్ధారమునకు వలసిన సర్వాంశములయందునునాశక్తికొలఁదిఁబాటుపడవలయును. ఇది నాసంకల్పము. పరమేశ్వరుఁడు దనయపారకృపా విశేషంబున నాయీసద్వాంఛితంబుల నెల్ల నెఱవేర్చును గాక! ఓ దీనశరణ్యా! నీయనుగ్రహాతిశయంబు నఁబూజ్య

లగుమజ్జననీజనకులను మఱల సందర్శించుభాగ్యంబు లభింప నున్నయది. అదిగో! మద్గృహంబు గానవచ్చు చున్నయది.

గీ. తల్లిదండ్రులఋణమునే ♦ తనయుఁ డేమి
సలిపినను దీర్పలేఁ డన్న ♦ సర్వజనక!
నీఋణంబును దీర్పంగ ♦ నేర్చు నెవఁడు?
పరమకారుణ్యమూర్తి యో ♦ భవ్యకీర్తి!

(అని నిష్క్రమించును.)



8 వ రంగము—రమాకాంతరాయిగృహము.

(రమాకాంతరాయియుఁ దారణీదేవియుఁ గూర్చుండి ప్రవేశించుచున్నారు.)

రమా—తారణీ! కైకమాట విని దశరథుఁడు సుగుణసముద్రుఁడగు రామభద్రుని నడవులపాలు చేసి చింతాక్రాంతుఁడై మరణమును శరణు చొచ్చెను. నే నన్ననో నీమాట విని పుత్త్రరత్న మగు రామమోహనుని నిలు వెడల నడఁచి చింతనే శరణు చొచ్చితిని. రామమోహనా! రామమోహనా! (అని విలపించును.)

తా—ప్రాణేశ్వరా! దుఃఖముచేత మొదలే కుంగి యున్ననన్ను మఱింత కుంగఁదీయ నెంచితిరా? మంచిది. మీచిత్తము

వచ్చినట్లు చేయుఁడు. రామమోహనా! రామమోహనా!

(అని శోకించును.)

(రామమోహనుఁడు ప్రవేశించి)

'మాతా! నేను రామమోహనుఁడను' (అని తల్లికి నమస్కరించును.)

తా—వచ్చితివా! నాయనా! రామమోహనా! (అని కౌఁగలించుకొని) ఇంతకుమునుపే మీనాయనగారు నన్నుఁ గైకను జేసి యుండిరి. తండ్రీ నీవు వచ్చి నన్నుఁ గౌసల్యగా మార్చితివి. ఇంతే చాలును. రామమోహనా! మీతండ్రి గారికి నమస్కరింపుము.

(రామమోహనుఁడు తండ్రికాళ్ల కెఱఁగి నిలువఁబడును.)

రమా—నాయనా! రామమోహనా! నిన్నుఁ జూచి సంతోషపరవశుఁడనై మాటలాడఁ జాలకున్నాఁడను. రమ్ము. కూర్చుండుము.

(తల్లిదండ్రులమధ్యఁ గూర్చుండి రామమోహనుఁడు తండ్రి వైపు చూచుచుఁ దనలో)

గీ. చిరముఁ బుత్రుండు దూరమై ♦ చెంతఁ జేర
నింతగాఁ దండ్రియే మది ♦ సంతసిల్లఁ
జిరముఁ బుత్రుండు దూరమై ♦ చెంతఁ జేర
నెంత పొదలెదొ నీవు లో ♦ కైకజనక!

(తల్లివైపు చూచుచుఁ దనలో)

గీ. అహహా! తల్లిని గన్ననా • కాత్మలోన
నింత హర్షంబు గలుగఁగా • హృదయమందు
నిన్ను జగదేకజననిరో! • గన్నయప్పు
డెంతహర్షంబు గలుగునో • యెన్నఁ దరమె.

త్రా—పద నాయనా! ఇన్నాళ్లకు నేఁడైనను మన మందఱమును గూడి సుఖముగా భుజియింతము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



# రామమోహననాటకము.

## తృతీయాంకము.

### 1 వ రంగము—కలకత్తానగరము.

(రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—సీ. అధికారు లెవరేని ♦ సర్వగౌరవ మిచ్చి
పని పుచ్చుకొనునోడం ♦ బడికమీఁద
రంగపూర్జిల్లాక ♦ రగ్రాహియా 'డిగ్బి'
దొరకు లేకరిగాను ♦ దొలుతఁ జేరి
కొనకు న్యాయాలయం ♦ బున శిరస్తాదారు
పనితోడ నుద్యోగ ♦ పథము వీడి
గౌరవంబుగ దినాల్ ♦ గడుపంగఁ దగినంత
ధనమును గడియించి ♦ ధర్మసరణి
నింక నాజీవనం బెల్ల ♦ నెలమితోడ
దేవ! యిడ వచ్చితిని దేశ ♦ సేవలోన
నడుపుభారంబు నీమీఁదఁ ♦ గడకుఁ బెట్టి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.
(అని నిష్క్రమించును.)

2 వ రంగము—హిందూమహాసభ.

(అందఱు గూడి యుండఁగా గౌరీకాంతభట్టాచార్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

గౌ—మహాజనులారా! రామమోహనుఁ డనుపరమనాస్తికుఁ డొక్కఁడు బయలుదేరి విగ్రహములను బూజింపఁ గూడ దనియు రామకృష్ణాదు లవతారపురుషులు గారనియు సమాయికు లగుమనవారికి బోధించు చున్నాఁడు. పలువు రప్పుడే యతనివలలోఁ బడి పోయినారు. ఆలస్యము చేసి యుదాసీనుల మై యుండినయెడల మనహిందూమతమునకు జెప్పరానంత గొప్పముప్పు నుప్పతిల్లు ననుటకు లేశ మైనను సందేహము లేదు. కాఁబట్టి యీయుపాయమునుండి మన మతము నెట్లు కాపాడుకొనవలయునో మనము తక్షణమే యాలోచింపవలయును. అందులకే మన మిక్కడ సమావేశ మైనది. నేఁటిసభకు గౌరవనీయు లగుశ్రీనారాయణ బోసుగారు అగ్రాసనాధిపత్యమును వహించుదురు.

(నారాయణబోసుగారు సభాధ్యక్షతను వహించి సభ్యులను జూచి)

మహాజనులారా! మనము సమావేశ మైనయుద్దేశమును శ్రీగౌరీకాంతభట్టాచార్యులు గారు విశదపఱచి యున్నారు. కాని రామమోహనులు ఏప్రమాణకారణములచేత విగ్రహారాధన కూడదనియు రామకృష్ణాదు లవతారపురుషులు

కారనియు సెలవిచ్చిరో మనకుఁ దెలియదు. దాని నెఱుంగక మనము తొందర పడుట న్యాయము కాదు. రామమోహనులపక్షమును దెలిసినవా రెవరేని యీసభయందుండినయెడల దానిని స్పష్టముగా మాయెదుటఁ బెట్టఁ బ్రార్థితులు. (అని కూర్చుండును.)

రామచంద్రవిద్యావాగీశుఁడు (లేచి నిలువఁబడి) అగ్రాసనాధిపా! మదీయ సోదరులారా! ఆలకింపుఁడు.

సీ. ఎవనిదృష్టికి ముందు ♦ నీజగం బెల్లను
నణువుకంటెను గూడ ♦ నల్ప మన్న
నెవనికాంతికి ముందు ♦ రవిమండలం బొక్క
యింద్రగోపముకంటె ♦ హీన మన్న
నెవనికీర్తికి ముందు ♦ నిందుబింబము చిన్న
వెలిపూసకంటెను ♦ వెలితి యన్న
నేదయాజలధికి ♦ నెల్లసముద్రమ్ము
నీటితుంపరకంటె ♦ నీచ మన్న
విగ్రహము దెల్ప నేర్చునే ♦ విశ్వవిభుని
భవ్యగుణ మొక్కయింతేని ♦ భ్రాతృలార!
స్వామి యొసఁగినమతి వ్యర్థ ♦ పఱతు రేల
యనుచు బోధించు రామమో ♦ హనుఁడు ఘనుఁడు.



అందఱు—సత్యము. సత్యము. ఎంతయు సమంజసముగ నున్నది.

రా—మఱియు వినుఁడు.

సీ. జగతి నందఱకును ♦ జన్మ మిచ్చెడుదేవుఁ
డెత్తునే జన్మంబు ♦ నెన్నఁడేని
విశ్వసృష్టిస్థితి ♦ విలయంబు లొనరించు
నీశుఁ డొందునె లయం ♦ బెన్నఁడేని
సర్వగతుం డయి ♦ సర్వసర్వాత్ముఁడుం
డెదుగునే యొదుఁగునే ♦ యెన్నఁడేని
నిర్వికారుం డయి ♦ నెగడెడుపరమాత్మ
యేడ్చునే నవ్వునే ♦ యెన్నఁడేని
బుద్ధుఁడును ముక్తుఁ డౌపరి ♦ శుద్ధమూర్తి
యెన్న బద్ధుఁడు దా నౌనె ♦ యెన్నఁడేని
స్వామి యొసఁగినమతి వ్యర్థ ♦ పఱతు రేల
యనుచు బోధించు రామమో ♦ హనుఁడు ఘనుఁడు.

అందఱు—అహహా! ఇది యెంతయు యుక్తి యుక్తమై యున్నయది.

రా—సీ. అతనిసద్గుణముల ♦ నంతటఁ గనుఁగొని
యానందపడుటయే ♦ యతనిపూజ
అతఁడు సృజించిన ♦ యన్నిప్రాణులకును
నభయం బొసంగుటే ♦ యతనిపూజ
అతని భజించెడు ♦ నట్టిసద్భక్తుల
నరసిమన్నించుటే ♦ యతనిపూజ

అతఁ డొసంగినవాని ♦ నతులకృతజ్ఞతా
మతిని సేవించులే ♦ యతనిపూజ
అతఁడు మెచ్చెడునట్లుగా ♦ నమలచరిత
గలిగి మనకాల మెల్లను ♦ గడపుచుండు
టదియె యొకపూటలోపల ♦ నతనిపూజ
యనుచు బోధించు రామమో ♦ హనుఁడు ఘనుఁడు.

అందఱు—అహహా! సర్వోత్తమ మైనయుపదేశము. అందఱ మీరామమోహనునే యనుసరింతము.

నా—మహాజనులారా! నేనును మీసన్మార్గమునే యనుసరించెదను. ఇది కేవలము మనఋషులవాక్యము లై యున్నవి.

గా—అయ్యో! అయ్యో! ఒక్కఁడైనను నామాట వినువాఁడు లేఁడే. కలి ప్రవేశించినది. అందఱిబుద్ధి యొక్కటైనది. నే నేమిచేయుదును? "వినాశకాలే విపరీతబుద్ధి" యన్నట్లు మీకు విపరీతబుద్ధి పుట్టినది. పొండు. చెడిపొండు. అందఱు చెడిపొండు. (అని పోవుచున్నాఁడు.)

(అందఱు నిష్క్రమింతురు.)



3 వ రంగము—మహమ్మదీయమహాసభ.

(అందఱు గూర్చుండి యుండఁగా సయ్యద్ అబ్దూల్ ఖాఁ
సాహేబుగారు ప్రవేశించుచున్నారు.)

స.అ—సభాసదులారా ! ప్రియసహోదరులారా ! మనమతము పర్వతమువంటిది. దీనిని ఢీకొని నిల్చినవా రెవ్వరును లేరు. నేఁ డెవ్వఁడో రామమోహనుఁ డనుకాఫరు దీనిని ఖండింపఁ దొడఁగినాఁడఁట! ఈమాట వినఁగానే నా కెక్కుడలేని రోషము వచ్చినది. కాని యిది మనరాజ్యము కాదు. మన కాలము కాదు. కాఁబట్టి నాకోపము నంతను మ్రింగికొని యూరకుండవలసి వచ్చినది. మనలోనికొందఱు నమ్మక్ హరాంలు ఆకాఫరుతోఁ గలసినా రని విన్నాను. ఇది మంచిది కాదు. మన మొకరిని గలుపుకొనువారమే కాని మన మొకరిలోఁ గలయువారము కాము కదా. కాఁబట్టి మనవా రెవ్వరును వానితోఁ గలయకుండు నట్టికట్టు దిట్టములు చేయుటకై నేఁ డీసభ యేర్పరుపఁ బడినది. హాజరత్ ఖ్వాజాసయ్యద్ మోహియుద్దీన్ సాహేబుగారు సభాధ్యక్షతను వహింతురు గాక.

హా—(అగ్రాసనమును వహించి)

సోదరులారా! ఆకాఫరు ఏమి చెప్పినాఁడో స్వయముగా విన్నవా రెవరైన నున్నారా?

సయ్యద్ మూర్తూజా (లేచి నిలువఁబడి) అయ్యా నేను

విన్నాఁడను.

హా—అతఁ డేమి చెప్పినాఁడు?

స.మూ.—హజరత్ గారు! సోదరులారా! ఆకర్ణింపుఁడు.

సీ. హాజరు నాజర్రై ♦ యలరెడు ''నల్లాకు''
నొకమధ్యవర్తి తా ♦ నుండవలెనె
కాలమ్ము దేశమ్ము ♦ కడలేక యుండఁగా
నాఖరు పైగంబ ♦ రనుట తగునె
మంచివారిని గూడ ♦ మర్యాద లేకుండ
నరె! కాఫరని పిల్వ ♦ న్యాయ మగునె
నోట ''రహీం'' మను ♦ మాటఁ జెప్పుచు హింస
చేతులారంగను ♦ జేయ నగునె
అమ్మహాత్ముఁ బోలిన ♦ యచలభక్తి
గలిగి సన్మార్గవర్తులై ♦ కాళ్ళిలకుండ
నుత్తమాటలఁ జెప్పుట ♦ యోగ్య మగునె
యనుచు బోధించు రామమో ♦ హనుఁడు ఘనుఁడు.

అందఱు—అతఁడు మనకు విరోధముగా నేమియుఁ జెప్పలేదు.
ఇతని యుపదేశములు గులిస్తాఁలోని హజరత్ సాదీగారి
యుపదేశములవలె సద్ధర్మబోధకము లై యున్నవి.

హా—నాకు నీతనిమాటలు చక్కగా నచ్చినవి.

స.అ.—మన పైగంబరును అందఱుపైగంబరులతో సమానము
గాఁ జూడవలసినదే?. ఛీ! మనలో నున్నపౌరుషము చచ్చి

పోయినది. ఇంక నే నేమి చెప్పినను బ్రయోజనము లేదు. ఈసభను జేర్చినందులకు నన్ను నేనే నిందించికొనవలసి యున్నది. (అని చివాలున లేచి పోవును.)

(అందఱు నిష్క్రమింతురు.)

---

4 వ రంగము—క్రైస్తవమహాసభ.

(అందఱు సమావేశమై యుండఁగా విలియంపాదిరిగారు ప్రవేశించుచున్నారు.)

వి—భ్రాతృవరులారా! పరమపావనమును అమోఘము నైన మనక్రైస్తవధర్మమును రామమోహనుఁ డనునొకనాస్తికుఁడు ఖండింప మొదలుపెట్టినాఁ డఁట. దానిని విని భక్తి విశ్వాసములు లేనికొందఱు క్రైస్తవనామధారులు అతని బోధనలకు లోఁబడినారఁట! మనము చూచుచు నూరకుంట యోగ్యము కాదు. తక్కినవారియం దైన శ్రద్ధాభక్తులు లోపముగాకుండు నట్లు తగినయేర్పాటులు చేయుటకై యీసభ గూర్పఁ బడినది. నేఁటిసభకు వెస్లిపాదిరిగారు సభాధ్యక్షులుగా నుండఁగోరెదను.

వెస్లిగారు (అగ్రపీఠము నలంకరించి సభ్యులను జూచి) మదీయ సోదరులారా! మనమతములోని యేవిషయములను రామమోహనుఁడు ఖండించినాఁడో మనము మొదటఁ దెలిసికొన

వలయును. అట్లు తెలిసినవా రెవరేని యీసభలో నుండిన
యెడలఁ దేటతెల్లంబుగా మనయెదుటఁ బెట్టుదురు గాక!

(జాన్ ఆదము పాదిరిగారు నిలువఁబడి)

అగ్రాసనాధిపా! సోదరులారా!

సీ. ఈశ్వరునకుఁ బుత్రు ♦ లెల్లర మై యుండ
"నేను" వొక్కఁడె పుత్రుఁ ♦ డెట్లు లగును
శిలువపై మరణంబుఁ ♦ జెందినమాత్రాన
మనపాపముల నెట్లు ♦ మాపఁ గలఁడు
అతని నమ్మికయున్న ♦ నమలవర్తన మున్న
నీశ్వరుఁ డరసి ర ♦ క్షింపఁ డెట్లు
అల్పపాపమునకు ♦ నంతమ్ము లేనట్టి
నరకవేదన గల్గ ♦ న్యాయ మెట్లు
పుత్రపితృవిమలాత్మలు ♦ మూఁడుగూడ
దేవుఁ డగు టెట్లు లొక్కఁడే ♦ దేవుఁ డుండ
భక్తిలోఁ గ్రీస్తుఁ బోలుఁడు ♦ ముక్తి గల్గు
ననుచు బోధించు రామమో ♦ హనుఁడు ఘనుఁడు.

వె——రామమోహనుని మాటలలోఁ జాలసత్య మున్నది.

అందఱు——మాకును నట్లే తోఁచుచున్నది.

వి——మొదటి ఆదము పిశాచముచేతఁ బ్రేరేపింపఁబడి యీశ్వరునకు విరోధముగఁ బాపము చేసి పతితుఁ డయ్యెను. ఇప్పు డీరెండవయాద మన్ననో రామమోహనుఁ డను

పిశాచముచేతఁ బ్రేరేపింపఁబడి ఏసుక్రీస్తునకు విరోధముగఁ బాపము చేసి పతితుఁ డయ్యెను. తాఁ జెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచె నన్నట్లు ఈవెస్లిపాదిరిగారిని నీక్రైస్తవసమూహము ను గూడఁ దనతో నీడ్చుకొని నరకకూపములోఁ గూలు నట్లు కనఁబడుచున్నది. ఈసభ గూడకుండినను బాగుగ నుండెడిది. చాలుఁ దమరందఱు దయచేయుఁడు. (అని లేచిపోవును.) (అందఱు నిష్క్రమింతురు.)



## 5 వ రంగము—హిందుమహాసభ.

(అందఱు సమావేశ మైయుండఁగా గౌరీకాంత భట్టాచార్యులుగారు ప్రవేశించుచున్నారు.)

గౌ—ఈ రామమోహనుఁడు మొట్టమొదట విగ్రహారాధనను ఖండించుటకుఁ బ్రారంభించినపుడే 'ఇతఁడు పరమనాస్తికుఁడు మనధర్మమునకు వేఱుపురుగు వంటివాఁడు. ఇతనిచేష్టల నాటంకపఱుపవలయు' నని యెంతో మొఱపెట్టుకొంటిని. ఎవరును విన రైరి. మీఁదుమిక్కిలి నన్నే తిట్ట నారం భించితిరి. దానిఫలము మీరు నేఁడు కన్నులారఁ జూచు చున్నారు కదా! మన కున్నస్వాతంత్ర్యముల నన్నిఁటిని నూడఁబెఱకవలె నని ప్రయత్నించుచున్నాఁడు. మనస్త్రీల మీఁద మనకు స్వాతంత్ర్యము లేదు. మనతోడిమానవుల

మీఁద మనకు స్వాతంత్ర్యము లేదు. మనస్త్రీలచేత సహగమనము చేయింపఁ గూడ దఁట. మనబిడ్డలను గంగలో వేయఁ గూడదఁట. చూచితిరా మన మేస్థితికి వచ్చితిమో! ఏ దెట్లుండినను మన హిందూధర్మమును దుదముట్ట నాశనము చేయుటకు బద్ధకంకణుఁ డయినయొక నాస్తికునిమాటను బురస్కరించుకొని సనాతనముగ వచ్చుచుండు సహగమనమును దొరతనమువారు ఆపివేయుట మాత్రము అతిసాహసము. మఱల నాసదాచారమును అనుష్ఠానములోఁ దెచ్చుటకై యుత్తరవిప్పింపవలయు నని పార్లమెంటువారికి మనము మహాజరు పెట్టుకొనవలసి యున్నది. దానికై యీసభ గూర్పఁబడినది. ఈసభకు గౌరవనీయు లగురాధాకాంతదేవుగారు అగ్రాసనాధిపత్యము వహింతురు.

రాధాకాంతదేవుగారు (అగ్రపీఠము నలంకరించి లేచి నిలువఁబడి)

మహాజనులారా! మనము గూడినయుద్దేశము మీకుఁ దెలిసినది కదా. ఇంక మనగౌరీకాంతభట్టాచార్యులుగారు మహాజరును జదివెదరు. (అని కూర్చుండును.)

మహేశచంద్రబెనర్జిగారు (లేచి నిలువఁబడి అగ్రాసనాధిపతిని జూచి) అయ్యా! నా దొకమనవి యున్నది. నాలుగు నిమిషములకాల మిచ్చినయెడల విన్నవించుకొనియెదను.

రా—మంచిది.

మ—బాగుచేయుటకు స్వాతంత్ర్య ముండవలెఁగాని పాడు చేయుటకా స్వాతంత్ర్యము ?

సీ. విద్యనీయక స్త్రీల ♦ వింత లోపశువుల
పగిదిఁ బెట్టినయట్టి ♦ పాప మొకటి
పంజరాల శుకాళి ♦ వలెఁ రాణివాసానఁ
బడఁతుల నిడినట్టి ♦ పాప మొకటి
వ్యభిచారకాంతల ♦ పాట లాటలు చూచి
స్వాంతమం దుబ్బెడు ♦ పాప మొకటి
బాల్యమందె వివాహ ♦ బంధంబుఁ గూరిచి
పాలతల్లిని జేయు ♦ పాప మొకటి
సాగుమానముపేరిట ♦ సతిని బట్టి
వహ్నిలోఁ బడఁద్రోసెడు ♦ పాప మొకటి
పట్టి మిము నాశమొనరించు ♦ పాపులార !
ఘోరకృత్యమ్ము లొనరించు ♦ క్రూరులార !

(అని నిష్క్రమించును.)

కొందఱు తప్ప సభనుండి యందఱు లేచి పోదురు.

రా—ఆచార్యులుగారు ! సభ చాలింతము.

గా—మనము భయపడ నక్కర లేదు. ఈయుండుసభ్యులే చాలును. ఒక్కొక్కరు 10, 20, 30 సంతకములు చేసిన యెడల నొకఘంటలో వేలకొలఁదిసంతకము లేర్పడును.

రా—మంచిది. మహజరు చదువుఁడు. సంతకములకేమి? అయినన్ని కానిండు.

గౌ—మహాజనులారా! మహజరు వినుఁడు.

ద్విపద.

ఓవిలియంరాజ! ♦ ఓనీతిభోజ!
ఓవిక్రమాదిత్య! ♦ ఓకృతకృత్య!
ఓప్రజామందార! ♦ ఓరణధీర!
ఓప్రభువరచంద్ర! ♦ ఓగుణసాంద్ర!
ఓప్రభువరులార! ♦ ఓప్రజలారా!
ఓప్రజాపాలనో ♦ ద్యుక్తాత్ములార!
నీతిగా దనుచు బెం ♦ టిక్ ప్రభు విపుడు
నాతికి సాగుమా ♦ నము గూడదనియె.
మము విచారింపక ♦ మము లెక్కగొనక
మము దూరు నొక్కని ♦ మత మాలకించి
మము దుఃఖమున ముంచి ♦ మాధర్మ మడఁచి
విమలకార్యము మాన్పి ♦ వేయంగఁ దగునె?
ఇది సనాతనధర్మ ♦ మిది వేదకర్మ;
మిది స్మృతిచోదితం ♦ బిది పురాణోక్త;
మిట్టి మాప్రియ మైన ♦ యీధర్మ మెడలి
యెట్టు లుండఁగనౌను ♦ హిందువు లగుచుఁ?
బూర్వ మగ్బరుకూడఁ ♦ బూనె నాపంగ

నుర్వి ధర్మము మాన్ప ♦ నోపు నెవ్వండు ?
గాన విన్నప మిది ♦ గరుణ నాలించి
మానక మఱిఁజేయ ♦ మా కాజ్ఞనిండు.
ముక్కోటిదేవతల్ ♦ ముదమొప్ప మిమ్ము
నొక్కట దీవించు చుందు ♦ రెల్లపుడు.

అందఱు—ఇప్పుడు పొద్దు వోయినది. మహాజరును దయచేసి సంతకములకు మామాయిండ్లకుఁ బంపుఁడు.

(అని అందఱు నిష్క్రమింతురు.)



6 వ రంగము—ఆత్మీయసభ.

ఈశ్వరోపాసనామందిరము.

(సభ్యులు గూర్చుండి యుండఁగా రామమోహనుఁడు వేదిపై నిలువఁబడి ప్రవేశించుచున్నాఁడు.)

రా—(కనులు మూసికొని చేతులు మోడ్చి)

సీ. జగదేకమాతకు ♦ సర్వనిర్ణేతకు
వందన మానంద ♦ మందిరునకు
బ్రహ్మాండకర్తకు ♦ బ్రహ్మాండభర్తకు
వందన మానంద ♦ మందిరునకుఁ
గారుణ్యమూర్తికిఁ ♦ గమనీయకీర్తికి
వందన మానంద ♦ మందిరునకు

నమలస్వరూపికి ♦ నాజగద్వ్యాపికి
వందన మానంద ♦ మందిరునకు
శాశ్వతంబుగఁ బొల్చున ♦ ఱ్వేశ్వరునకు
నిరుపమనిరంజనుం డగు ♦ పరమపితకు
భక్తమందారుఁ డౌపర ♦ బ్రహ్మమునకు
వందన మ్మిదె యానంద ♦ మందిరునకు.

(అని కనులు దెఱచి సభ్యులను జూచి)

భ్రాతృవరులారా! పరమకరుణాళు వగుపరమేశ్వరుని యవ్యాజానుగ్రహంబున మన కీమందిరము లభించినది. ఇందు సత్యజ్ఞానానంద స్వరూపుఁ డగుపరబ్రహ్మమును భక్తితో నారాధించుసదుద్దేశము గలవా రందఱు ధారాళముగ సమావేశము గావచ్చును. ఇందు నేదో యొక తెగవారిచే నేదో యొకవ్యక్తికిమాత్రమే యన్వయించు నామంబుచే నీశ్వరుని గీర్తింపఁ దగదు. ఇందు నేవిధ మైన చిత్రపటము గాని ప్రతిమ గాని పెట్టఁ గూడదు. ఇందుఁ బ్రాణిని జంపుట కాని హింసించుట కాని జరుగఁగూడదు. బలికానుక లెవ్వియు నిచ్చుట నర్పింపఁ దగదు. ఈప్రదేశము విందులకుఁ గాని యల్లరులకుఁ గాని యుపయోగింపఁ దగదు. ఆత్మరక్షణార్థ మావశ్య మైనపుడుతప్ప నిచట నన్నపానాదు లెవ్వియు జరుపఁ గూడదు. ఇతరులకుఁ బూజ్య మైనదాని నిందు దూషింపఁ గూడదు. కేవలము పర

మేశ్వరునియుపాసనను గొలుపునట్టియు దానము, ధర్మము, నీతి, పరోపకారము మొదలగుసద్విషయములను బోధించు నట్టియు, నన్నిమతములవారిలో నన్యోన్య ప్రేమను బురి కొల్పు నట్టియు సదుపదేశములు మాత్రమె నిరాటంకముగ జరుపవచ్చును. పరమేశ్వరుఁడుదనయపారకృపాకటాక్షంబుచే నీమందిర మీయుద్దేశములకే వినియోగపడునట్లు లనుగ్రహించునుగాక ! ఓం తత్సత్. బ్రహ్మకృపాహి కేవలమ్. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. (అని కూర్చుండును.)

(సభ్యులలోనుండి రామచంద్రవిద్యావాగీశుఁడు లేచి నిలువఁబడి,)

ఓపరమపితా! పరమేశ్వరా! ఈజగత్తు నంతను క్షేమాస్పదమైనయొక్క కుటుంబముగా మార్చుటకై నీపరిశుద్ధమైన యుపాసనను బ్రతిహృదయంబునను నెలకొల్పఁ బాటుపడు భక్తాగ్రగణ్యుల కందఱికిని శరణాలయంబుగ నీమందిరంబును బ్రసాదించినమనరామమోహనుని సమస్తసద్వాంఛలును నీకృపాతిశయంబుచే సంపూర్ణముగ ఫలించును గాక ! సత్యము జయించును గాక ! ధర్మము వర్ధిల్లును గాక ! (యని యాశీర్వదించును.)

(అందఱుఁ గరతాళధ్వను లొనర్చుచునిష్క్రమింతురు.)

---

## 7 వ రంగము—రామమోహనునిమందిరము.

(రామమోహనుఁ డేకాంతముగఁ గూర్చుండి పరివేశించుచున్నాఁడు.)

రా—(తనలో) ' వేలకొలఁది హిందూమహాజనులు సహగమనమునకు మఱల నుత్తర వొసంగవలయునని మాకు మహాజరు పెట్టుకొన్నారు. సాధ్య మైనంతత్వరలో నది విచారింపఁ బడును. సహగమనము కూడ దనువారలు దగినయాధారములను దత్సమయమున మాకుఁ జూపకేని మఱల నాయాచారమును ఆచరణలోఁ దెచ్చుటకు నుత్తర వొసంగఁబడు ' నని పార్లమెంటువారు ప్రకటపఱచినారు. ఇంగ్లాండునకుఁ బోఁగలిగినంతధనము నాయొద్ద లేదు. నే నెవ్వఁడును దేహియనియొకనినాశ్రయింప లేదు. నా కీవిషమ సమయమునఁ బరమేశ్వరుఁ డెట్లుతోడ్పడ నున్నాఁడో నాకుఁ దెలియదు.

సీ. ఎన్నియోమార్లు నా ♦ యిచ్చను నెఱవేర్చి
నను గృతార్థుని జేసి ♦ నావు గావె
పరమదీనావస్థఁ ♦ బడి యున్నపడఁతులఁ
గావఁ గంకణ మూని ♦ నావు గావె
శరణాగతత్రాణ ♦ వరబిరుదంబును
దేవ ! వహించి యు ♦ న్నావు గావె

యెట్టికార్యము నైన ♦ నింతలోపలఁ జేయ
నైవింతఁ జూప ను ♦ న్నావు గావె
యెన్న నీకంటె నా కెవ ♦ రున్నవారు
భారమంతయు నీమీఁద ♦ వైచినాఁడ
నెగ్గులగ్గులు నీవె నా ♦ కేమి లేవు
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

(అని పరమేశ్వరుని ధ్యానించి కూర్చుండియుండఁగా సేవకుఁ డొకఁ డుత్తరమును,ఒక వెండిపళ్లెరము నిండ సువర్ణపుష్పంబులను, మఱియొక పళ్లెరములో నొక జతసాలువలను దెచ్చి యెదుటఁ బెట్టును.)

రా—(ఉత్తరముఁ జదివి చూచికొని) ఆహా! ఏమి పరమేశ్వరుని యనుగ్రహము ! ఈయుత్తరము ఢిల్లీచక్రవర్తియొద్దనుంచి వచ్చినది. వారు నాకు "రాజా" యనుబిరుదము నొసంగి యీసువర్ణపుష్పంబులను, ఒకజత సాలువులను బహుమానముగా నంపి తమ, కిప్పు డాంగ్లేయదొరతనమువా రొసఁగుచుండు గౌరవవేతనము అతి స్వల్పము గనుక దాని నెచ్చింపఁ బార్లమెంటుసభలో మనవిచేయవలె ననియు, నాకు నగువ్యయమునంతను దామే భరింతు మనియు సెల విచ్చి యున్నారు. ఇంతకంటె నాకు మ ఱేమి కావలయును? పరమేశ్వరా!నీదయావిశేషమును నేనేమనికొనియాడుదును? ఈసంతోషవార్తను నామిత్రులకును దెలిపి వారికినిగూడ

నీయానందములో భాగము నొసంగెదను.
(అని సేవకునిచేతిలో రెండుసువర్ణములను బెట్టి నిష్క్రమించును.)



8 వ రంగము — రేవు.

( మిత్రులు గూడియుండఁగా రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా — మిత్రులారా! చూచితిరా! పరమేశ్వరునియనుగ్రహము. మనలో నొక్కొక్కఁడును దనజీవితమును జూచుకొన్న యెడలఁ బరమేశ్వరుఁ డెన్నిపర్యాయము లెన్నివిధములఁ దనకుఁ బ్రత్యక్షమయినాఁడో తెలిసికొనఁ గలఁడు. అతఁ డింతప్రత్యక్షముగా గోచర మగుచుండినను మనబుద్ధిమీఁద నజ్ఞానమనుపొర గప్పి యుండుటచేతఁ గనుగొన లేక యున్నారము. మీతో నెంతయో ముచ్చటింపవలెనని కోర్కె యున్నది;గాని నా కవకాశము బొత్తుగా లేకున్నది. ఓడలోనికిఁ బోవలసినసమయము సమీపించినది. నాకు సెల విండు.

పంచపాదిగీతము.

దేశహిత మెంచి పోదు వి ♦ దేశమునకు
నింక మిముఁ జూతునో లేదొ ♦ యీశ్వరేచ్ఛ

యెట్టు లున్నదో తెలియంగ ♦ నెవనితరము?
ఎల్లదప్పిదముల క్షమి ♦ యింపుఁ డంచు
మిమ్ము వేఁడెద సెలవిండు ♦ మిత్రులార!

(తనలో)

గీ. చేరి యాపార్లమెంటులో ♦ ఘోర మైన
సాగుమానముఁ గూర్చి నే ♦ సాక్ష్య మిచ్చు
వఱకు దేహంబులోపలఁ ♦ బ్రాణ మున్నఁ
జాలుఁ జాలును బరమేశ! ♦ చాలుఁ జాలు.

(అని నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.



# రామమోహన నాటకము.

## చతుర్థాంకము.

### 1 వ రంగము—లండను నగరము.

రామమోహనుఁడు నివసించుగృహము.

(సహగమనవిషయమందు సాక్ష్యమిచ్చుటకుఁ బార్లమెంటుకుఁ బోవ సంసిద్ధుఁడై రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—(తనలో)

సీ. ఫ్రాంసుదేశము నేలు ♦ రాజు "ఫిలిప్పు" నన్
గౌరవించిన దొక్క ♦ గౌరవంబె
ప్రభు వగు "విలియము" ♦ పట్టాభిషేకాన
గౌరవించిన దొక్క ♦ గౌరవంబె
యిచటి విద్యావంతు ♦ లెలమితో నుప్పొంగి
గౌరవించిన దొక్క ♦ గౌరవంబె
ఆస్తికసభవార ♦ లమితహర్షంబున
గౌరవించిన దొక్క ♦ గౌరవంబె
మించుదయతోడ నీపార్ల ♦ మెంటువారు
మహిని సహగమనంబును ♦ మాన్పఁజేసి

అఖిలసద్గుణమూర్తి కృ • పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక • చక్రవర్తి.
(అని నిష్క్రమించును.)



2 వ రంగము—పార్లమెంటు.

(సభ్యులు కూర్చుండి యుండఁగా నగ్రాసనాధిపతియెదుట సాక్ష్య మిచ్చుటకై నిలువఁబడి రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—

ద్విపద.

ఓదయాపరులార ! • ఓసభ్యులార !
నేదేశహితమునే • నెమ్మదిఁ గోరి
సాగుమానము గూర్చి • సాక్ష్యంబు నిత్తు
బాగుగా నాలింపఁ • బ్రార్థింతుమిమ్ము ;
నతిఘోర మైనట్టి • యాచార మనిన
నతిశయోక్తిగ మీర • లనుకొనవలదు;
సహగమనముఁ జూడఁ • జాలు నెవండు ?
అహ ! తలంచిన గుండె • లదరఁ దొడంగుఁ
బతి మృతినొందఁగాఁ • బలవించుచుండు
నతిచెంత స్వార్థులు • చయ్యన మూఁగి
" పతిలోకమును జేర్చు • పరమపథంబు

సతికిఁ జూడంగను ♦ సాగుమానంబు.
అతివకు నిది మంచి ♦ యాచార మమ్మ
పతికి స్వర్గము నిచ్చు ♦ పని యిది యమ్మ'
అని పురికొల్పి యా♦యబల వౌనగల
ననుకూల మైనంత ♦ నందఱు దోఁచి
త్రాఁగ మైకమునిచ్చి ♦ ధగధగమండు
లాగునఁ జితిలోన ♦ లలనను ద్రోసి
తప్పి యీవలఁ బడఁ ♦ దగిన వెదుళ్ల
నప్పుడె దడబడ ♦ నామెను గ్రుచ్చి
మంటలో వైతురు ♦ మఱి బొబ్బ లిడిన
జంటతప్పెటలను ♦ సామఘోషములఁ
జప్పుడు వినకుండఁ ♦ జంపుదు రకట!
ఒప్పునే యీహత్య ♦ యో సభ్యులార!
తలఁచిన గుండెలు ♦ తటతట మనవె?
కలదె యింతటికంటెఁ♦ గఠినకార్యంబు?
ఇదియె ధర్మం బైన ♦ నింక నధర్మ
మెదియొ యోచింపుఁడు ♦ హితమతులార!
పతి చావ సతి నగ్నిఁ ♦ బడవేయునట్లె
సతి చావఁ బతి నట్లె ♦ నలుపక యుంట
స్వార్థులు పన్నిన ♦ చర్య లివంచు
నర్థమ్ము స్పష్టమై ♦ యలరును గాదె?

ఆదయానిధు లగు ♦ నాఋషివరుల
వేదమం దిది యెట్లు♦ వెదకిన లేదు;
గాన సోదరులార! ♦ కరుణాత్ములార!
దీనిని మాన్పి యా ♦ దేవునికరుణఁ
బడయుఁడం చని మిమ్ము ♦ వదలక వేఁడి
కడసారి యొకతూరి ♦ కరములు మోడ్చి
"చయ్యన మాన్పుఁడు ♦ సాగుమానంబుఁ;
జయ్యన మాన్పుఁడు ♦ సాగుమానంబు"
నని మొఱ వెట్టెద ♦ నంద రాలించి
కనికర మెదనుండి ♦ కడఁగుఁ డీపనికి.

(అని కూర్చుండును.)

అగ్రాసనాధిపతి—రాజా రామమోహనరాయలుగారు! మీ సాక్ష్యము నాలించితిమి. సహగమనమును మాన్పివేసితిమి. మహజరు బుట్టదాఖ లయ్యెను.

రా—(సభ్యులను జూచి) మీకందఱికిని వందనములు. (అని తలవంచి తనలోఁ బరమాత్మ నుద్దేశించి)

గీ. వందనశతమ్ము నీకు నో ♦ భక్తభరణ!
వందనసహస్రములు నీకుఁ ♦ బాపహరణ!
వందనార్బుదములు నీకు ♦ భవ్యసుగుణ!
వందనశతార్బుదమ్ము లా ♦ నందసదన!

(అని నిష్క్రమించును.)

3 వ రంగము—లండనునగరము.

రామమోహనునిగృహము.

(రామమోహనుఁడు బ్రిస్టల్ నగరమునకుఁ బోవ నుద్యుక్తుఁడై ప్రవేశించుచున్నాఁడు.)

రా—(తనలో) ఢిల్లీచక్రవర్తిగారివిషయమై నే నెంతో ప్రయత్నించితిని. కొనకు సఫలము గాదయ్యెను. కాఁబట్టి నేఁటి నుండి నావ్యయమును నేనే భరించెదను. డాక్టర్ కార్పెంటరు దొరగారు నన్నుఁ బరిశుద్ధాస్తికమతవిషయమై యుపన్యసించుటకు బ్రిస్టల్ నగరమునకు రావలసిన దని కోరినారు. నే నక్కడకుఁ బోయెదను.

గీ. ఇంక నీయిష్ట మెక్కడి • కేని నన్నుఁ
దీసికొని పొమ్ము నీకోర్కి • దీర్చుకొమ్ము
అఖిలసద్గుణమూర్తి క్రై • స్తానువర్తి
సర్వనుతకీర్తి లోకైక • చక్రవర్తి.

(అని నిష్క్రమించును.)



4 వ రంగము—బ్రిస్టల్ నగరము. ఆస్తికసభ.

(సభ్యులందఱు గూర్చుండి యుండఁగా నుపన్యసింప వేదిపై నిలువఁబడి రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—భ్రాతృవరులారా!

సీ. బ్రహ్మాండముల నెల్ల ♦ బంతులుగాఁ జేసి
వింత నాడించుచు ♦ వెలయు నెవఁడు
లోఁతుగాఁ బాపాబ్ధి ♦ లో మునింగినవారిఁ
జెంగునఁ బైకెత్తి ♦ చెలఁగు నెవఁడు
అత్యద్భుతమ్ముగా ♦ నన్నిఁటిలో నిండి
మిణుకు మిణుక్కని ♦ మించు నెవఁడు
పట్టరానట్టితా ♦ పమునఁ బొర్లెడువారి
నోడి నిడి యోదార్చి ♦ యొప్పు నెవఁడు
విడువకుండఁగ నందఱ ♦ వెంట నుండి
హెచ్చరిక దెల్పి కాచుచు ♦ నెసఁగు నెవఁడు
అతఁడు సద్గుణమూర్తి కృ ♦ పానువర్తి
సర్వనుతకీర్తి లోకైక ♦ చక్రవర్తి.

తల్లియుఁ దండ్రియు గురువును మిత్రుఁడును రాజును వైద్యుఁడును సేవకుఁడును సమస్తము నై మనయాత్మలను వికసింపఁ జేయుచుండు నాపరమపురుషుని జగత్తులోని యందఱును బూజింపఁగడంగితిమేని భూతలం బంతయు స్వర్గమ్ముగా మారి రోగములు శాంతించును. యుద్ధము లంతరించును. దయ తాండవ మాడును. శాంతము రాజ్యము చేయును. ఇట్టి యచంచల మైనభక్తిని హృదయంబులఁ బురికొల్పుమతమునకే పరిశుద్ధాస్తికమత మని పేరు. సభ్యులారా! అందఱిని బరమేశ్వరుఁ డుద్ధరించును.

గాత. పాపము శమించును గాక! సత్యము జయించును గాక. ధర్మము వర్ధిల్లును గాక. (అని మూర్ఛిల్లును.) అప్పుడు డాక్టరు సమీపించి పరీక్షించి మిక్కిలి బడలికచేత వీరికి జ్వరము వచ్చినది. తగినవిశ్రాంతి నొసంగవలయును. వీరిని నేకాంతముగ నుంచ వలయును.

(అందఱు నిష్క్రమింతురు.)



5 వ రంగము—బ్రిస్టల్ నగరము.

ఏకాంతగృహము.

(మంచముపైఁ బరుండి రామమోహనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రా—(నిట్టూర్పుతో) నన్నాదరించిన యీదేశమువారికిని నంతకంటె నీనగరమువారికిని నంతకంటె నీకుటుంబమువారికిని నే నెంతయుఁగృతజ్ఞుఁడను. ఆర్యావర్తమా! నీసేవ చేసితిని. నీవు సమస్తదేశములకు శిరోభూషణ మగుదువు గాక. నీ సంతాన ముత్తమసంతాన మగును గాక. నీపిల్లలు విద్యావంతులు, యశోవంతులు, దయావంతులు, న్యాయవంతులు, ధైర్యవంతులు, శౌర్యవంతులు, సత్యవంతులు, దీర్ఘాయుష్మంతులు, ధర్మాత్ములు, భగవద్భక్తు లగుదురు గాక. పరమేశ్వరా! కృపాళూ! ఇదిగో! నాయాత్మ నీకొఱకు

వేచి యున్నది. దీనిని స్వీకరింపుము. రమ్ము. ఓం ఓం ఓం.

(అని శాంతించును.)

## భరతవాక్యము.

అందఱును రామమోహను ♦ చందమునను
జితమైనట్టిపరమప ♦ విత్రచరితఁ
బూని భూలోకమును స్వర్గ ♦ భూమి గాఁగఁ
జేయుదురుగాత! ధర్మంబు ♦ చెలఁగుఁ గాత!

## గద్య.

ఇది శ్రీపరమేశ్వర కరుణాఫలిత లలితకవితాకలిత శ్రీ రామ
లక్ష్మాంబా బుచ్చివేంకయామాత్యతనూజాత సకల
సజ్జనవిధేయ ఆదిపూడి సోమనాథనామధేయ
ప్రణీతంబయిన రామమోహననాటకము
చతుర్థాంకము సర్వంబును
సంపూర్ణము.

# ఆంధ్ర రఘువంశముపై

## బుధజనాభిప్రాయములు.

---

**I.** బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు. B.A.

దయాపూర్వకముగా నాకొసంగఁబడిన భవదాంధ్రీకృత 'రఘువంశము' లోఁ గొన్ని భాగములు చదివి యానందించితిని. చదివినంతవఱకుఁ బద్యములు మనోహరములుగను నిర్దోషములుగను సుబోధములుగ నున్నవి.

మూలగ్రంథశ్లోకములుగూడఁ బ్రకటించుట కడునుపయోగకరముగ నున్నది. చాలవఱకుపజాతిపద్యములలోఁ దెనిఁగించుటవలన నిరర్థకపదము లెక్కడనోకాని కానరాకుండ మీపుస్తకము మూలగ్రంథానుసారముగ నున్నది.

కవిపుంగవుఁడగు కాళిదాసు కవితాపాయసము, సముచితపాత్రమునఁ దెలుఁగువారికి విందిడి వారికృతజ్ఞతావందనములకుఁ బాత్రులైనారు.

ఇది పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగ నేర్పఱుచుట కన్నివిధముల ననువైయున్నదని నాయభిప్రాయము.

పిఠాపురము.<br>23-7-13

ఇట్లు విన్నవించు భవన్మిత్రుఁడు,<br>కూచి నరసింహము.

---

**II.** బ్రహ్మశ్రీ పురాణం నాగభూషణంగారు.

తమయాంధ్రరఘువంశము మిగులరమణీయ మగుకావ్యము. సంస్కృత

కవిసార్వభౌముఁ డగుకాళిదాసునిరఘువంశము దెనిఁగించి మీరాంధ్రలోకమునకు మహోపకార మొనర్చితిరి. సంస్కృతకావ్యములలో వాల్మీకిరామాయణము, కాళిదాసరఘువంశము మిగులసులభముగ నున్న ట్లగుపడినను జదివినకొలఁదిఁ గవి హృదయము దెలిసి గ్రంథకర్తలయదృశప్రజ్ఞావిశేషము దేటపడును. మూలమం దుండురసమునకు, గాంభీర్యమునకు భంగము కలగకుండ తాముసులభశైలిని దెనిఁ గించఁ గలిగితిరి. ఈయాంధ్రరఘువంశము బాలురచేతను స్త్రీలచేతను జదివించిన యెడల వారికి బుద్ధి వికసించును. మనస్సున కానందము కలుగును. మీయాంధ్ర రఘువంశ మాంధ్రవాఙ్మయములో శాశ్వతముగ నుండదగుగ్రంథమగుటంజేసి యాంధ్రదేశీయులు మీగ్రంథమును దగిన ట్లాదరింతు రనినమ్ముచున్నాను.

పురాణం నాగభూషణం.

---

## III. బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు.

అయ్యా! మీరు స్నేహపూర్వకముగా నంపినయాంధ్రరఘువంశమును సావధానముగాఁ జదివి మిగుల సంతసించితిని.

ఆకావ్యము మిక్కిలి మనోహరముగను సలక్షణముగను మూలానుసారముగను నున్నది. కాళిదాసునికవిత్వమాధుర్యము బయల్పడున ట్లాగ్రంథమును సుబోధమగుపద్యకావ్యముగాఁ దెనిఁగించు టాంధ్రలోకమున కుపకారము చేయుట యనితలంచెదను. మఱియు నందు మూలముసయితము ముద్రింపించుటచే నాపాత్తము సంస్కృతముచదువంగోరువారికి నుపకరించును.

చిత్తగింపుఁడు.
విధేయుఁడు,
పురాణపండ మల్లయ్యశాస్త్రి.

పిఠాపురం.
17-8-13

## IV. బ్రహ్మశ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశ రావుగారు.

తాము దయాపూర్వకముగఁ బంపినయాంధ్రరఘువంశమును శ్రద్ధతోఁ జదివి యపరిమితానందముఁ బొందితిని. శ్లోకమును దానికెదురుగ భావపూరిత మైన తెలుగుపద్యమును కలిపి ప్రకటించుటవలన జదువరులకుఁ గలుగుచున్నలాభము వర్ణనీయము. సంస్కృతజ్ఞానలవము గల్గి, తెలుగుకావ్యసారము గ్రహింపగలవా రెల్లరును మీభాషాంతరీకరణమున మూలమునందలిసారము, భావమూ, గంభీరము, మార్దవము లోనగున వొక్కటియైన తొలగిపోక కడురమ్యముగను హృద్యముగను మీకావ్యము రచింపబడె ననినిష్కల్మషముగఁ బల్కక తీరదు. తేటగీతలలో మూలమునందలిరసమునంతయు నిముడ్ప జాలినమీప్రజ్ఞ స్తవనీయము. నేనుకవిని, పండితుఁడను గాకున్నను శ్రోత్రపేయమై మనోరంజకమై నిర్దుష్టముగ నున్న మీభాషాంతరీకరణమునకు నాయీయభిప్రాయమును విన్నవింప సాహసించి నందుకు మన్నింతు రనినమ్ముచున్నాను.

కాకినాడ.
24-8-1913

చిత్తగించవలెను,
దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావు.

---

## V. బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజుగారు.

మీరు దయాపూర్వకముగ నంపిన "ఆంధ్రరఘువంశపద్యకావ్యము" ను జదివి యమితానందభరితుఁడ నయితిని. మహాకవి "కాళిదాసు," ఆంగ్లేయ కవిపుంగవుఁ డగు "షేక్స్పియరు" నకు సమానుఁ డనికొందఱును, అనేక విధముల నాతనికంటె నెక్కువవాఁ డనికొందఱును జెప్పుదురు. పృథివియందు సమానాధికరహితుఁ డగుకవి యీతఁడొకఁడే యనుట యనేకులయభిప్రాయమై యున్నది. అట్టివిఖ్యాతిఁ గాంచినకవిశ్రేష్ఠుఁడు గీర్వాణభాషయందు విద్యార్థులకేకాక పండితులకు సయితము లోకజ్ఞానము లెస్సగఁ గలుగుపొంటె రచి

యించిన రఘువంశమహాకావ్యము కావ్యములలో మేలుబంతి యనఁదగి యున్నది. చిరకాలమునుండి నేఁటిదనుక సంస్కృతవిద్య నభ్యసింపఁగోరువారి కెల్లరకును బుస్తకరూపమున నుండెడిగురువు ప్రప్రథమమునఁగాళిదాసే యగుచున్నాఁడన నాతనినిగాని యమ్మహాకవికిఁ దాదృశ మైనచిరయశస్సు సంపాదించుచుండు ప్రథమకావ్య మగురఘువంశమునుగాని యేమని పొగడఁ గలము?

అట్టి యమూల్యకావ్యమును సంపూర్ణముగఁ దెలిఁగించి యాంధ్రలోకమునకు మీరు మహోపకార మొనరించి యున్నారు. ఏతాదృశమహాకావ్యముల నింకను మీరు చేయునట్లు సకలజగత్కర్త యగుపరమేశ్వరుఁడు మీకు నాయురారోగ్యానందంబుల నొసంగుఁగావుత మని ప్రార్థించు చున్నాఁడను.

ఈగ్రంథమునందలి మీపద్యములశైలి మిగుల ధారాళముగను, మృదువుగను, రసవంతముగను, మనోహరముగను నున్నది. మఱియు సంస్కృతమున శ్లోకము లెట్లు మృదుమధురముగ నున్నవో తెలుఁగున మీపద్యములును అట్లున్నవి. ఆంధ్రీకరణము కడవఱకు మూలమున కన్యూనానతిరిక్తముగ నొప్పారుచున్నది. పూర్వ మీరఘువంశమును దెనిఁగించిన "అవుదూరి కేచ్చయ్య" కవి యాంధ్రీకరణముకంటె మీయాంధ్రీకరణము వేవిధముల మిన్నగనున్నది. మఱియు సంస్కృతమున నించుకంత జ్ఞానము గలవారుసైతము మీపద్యముల సాహాయ్యమునఁ "గాళిదాస" మహాకవియొక్క సంపూర్ణాభిప్రాయములను బాగుగ గ్రహింపఁగలరనియు, సంస్కృతకావ్యములలో నెట్టిమహిమ మున్నదో తెలిసికొనఁగలరనియు నేను దలంచెదను. వేయేల? తనకవితాసామర్థ్యము నెల్లను ఆంధ్రలోకమునకు వెల్లడి చేయుతలంపునఁ "గాళిదాస" మహాకవియే తన మహిమను మీయందుఁ బ్రవేశపెట్టి మీచే నీయాంధ్రీకరణమును జేయించెనేమోయని యూహించు చున్నాఁడను.

చిత్తగింపుఁడు,
ఇట్లుమిత్రము,
నడకుదుటి వీరరాజు.

పితాపురము.
28-8-13

## VI. బ్రహ్మశ్రీ ఓలేటి పార్వతీశముగారు.

శ్రీరాజితాదిపూడికు
లారామవిలాస సురభి ♦ శాంచన్నవమం
దారా! సారాచారా
నాఁతసత్కృత్యా! సోమ ♦ నాథామాత్యా!

చంపకమాలిక.

పలుకులఁ దేనె లుట్టిపడ ♦ భావము లర్థములందు విచ్చుమొ
గ్గలనెఱతావుల ట్లలరఁ ♦ గాఁ బసమించెడుతక్కఁజినుకుపూ
సలసరులట్లు పద్యము ల ♦ సంఖ్యము, లప్రతిమానకల్పనా
లలితము, లద్వితీయపద ♦ లంకృతముల్, రుచిరప్రవృత్తముల్
సెలఁగఁగఁ గాళిదాసకవి ♦ శేఖరుఁ డుజ్జ్వలధీవిశారదుం
డలఘుతరాత్మశక్తికి స ♦ మర్హగతిన్ విరచించినట్టిని
ర్మలరఘువంశకావ్యము స ♦ మంజసరీతిఁ దెనుంగుబాసలోఁ
నలరఁగఁ జేసి మీరలు ద ♦ యామతిఁ బంపినగ్రంథరాజమి
మ్ములఁ బరికించినాఁడ మదిఁ ♦ బొంగెడుహర్షపయోధివీచికా
కలన మునింగినాఁడఁ; గుతు ♦ కంబునఁ దేలినవాఁడ; భావభం
గులఁ దనివొంది నెమ్మిఁ గనఁ ♦ గోరినవాఁడ; రసానుభూతి స
న్నలమిన లోఁగి మైమఱపు ♦ నందినవాఁడ; సమిద్ధసూక్తిసం
కలితుఁడ నై వడిం దెలివిఁ ♦ గాంచిన వాఁడ; భవత్కవిత్వని
స్తులవిభవంబుఁ జాఁటుటకుఁ ♦ దోరముఁ గట్టఁగలేదు గాని మీ
తెలుఁగును గాళిదాసకవి ♦ ధీరునిసంస్కృతవాణి యెట్టుల
ట్టులె తగియుంట నెమ్మదిఁ గ ♦ డుంగడు సంతసమంది యీగతిన్
వెలువఱుపంగడంగితి వి ♦ వేకధురీణ! యథార్థరీతి నిం
పు లెసఁగ, మూల మింతచెడి ♦ పోవకయుండఁగఁ దేట తెల్గుమా
టల విరిదేనెతేటలమి ♦ టారము దోఁపఁగ వింతవింతజా

తులపికిసోన లోకకృపరి ♦ దోచినయట్టులు, పూవుదేనెవాఁ
కల లలరేఁగి హాయిగను ♦ గానము చేసినయట్లు, కమ్మతా
వు లొలయఁ చిన్న తెమ్మెరలు ♦ పొందుగవీఁచెడునట్లు తేటగీ
తులరఘువంశ మాంధ్రమునఁ ♦ దోరముమీర రచించు నీదుని
ర్మలకవితాప్రభావగరి ♦ మంబు నుతింపఁ దరంబె మిత్రమా!

ఇట్లు
భవదీయమిత్రుఁడు,
ఓలేటి పార్వతీశము..

పిఠాపురము.
20-9-13



## VII. బ్రిహ్మశ్రీ జయంతి రామయ్యాగారు.

అయ్యా! తమ యాంధ్రరఘువంశము చదివినాఁడను. భావములు మూలానుసారముగను కవిత్వము సరసముగను సరికూణముగను నున్నవని నా యభిప్రాయము. బహుభంగుల మీగ్రంథము విద్వదాదరణీయమనుటకు సందేహము లేదు.

విధేయుఁడు,
జయంతి రామయ్య.

చెన్నపట్టణము.
28-9-13



| | | |
|---|---|---|
| ఆంధ్రరఘువంశము(సంస్కృతరఘువంశసమేతము)రు | | 1—0—0 |
| గీతాంజలి | ... | 0—8—0 |
| రామమోహననాటకము | ... | 0—6—0 |

వలయువారు పిఠాపురములోని గ్రంథకర్తగారికి వ్రాసినఁ బడయగలరు.

# గీతాంజలిపై

## బుధజనాభిప్రాయములు.



### I. బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు. B.A.

కవిశ్రేష్ఠుఁడును భక్తాగ్రగణ్యుఁడు నగు శ్రీరవీంద్రనాథటాకూరుగారిచే నాంగ్లేయభాషలో రచింపఁబడిన శ్రీగీతాంజలిని మ. రా. శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు పద్యకావ్యముగ నాంధ్రీకరించి యాంధ్రదేశమునకుఁ జాల నుపకారము చేసినారు. ఆంధ్రీకృతగీతాంజలి నేను గొంతవఱకుఁ జూచి నాఁడను. శైలి మనోహరముగ నున్నది. సోమనాథరావుగారు సహజముగ భక్తు లగుటచేఁ బలుతావులఁ బద్యములు భక్తిరసంబు వెలిగ్రక్కుచున్నవి. అనుభవైకవేద్యము లగునిగూఢభక్తివిషయములు కొన్ని గ్రంథమం దుండుటచే నది యంతయు సులభగ్రాహ్యంబు గాకున్నను భక్తిచేఁ దరింపఁగోరువారికిఁ గడు నుపయోగకారి యని నాయభిప్రాయము.

పిఠాపురం.<br>8-11-13

ఇట్లువిన్నవించు భవన్మిత్రుఁడు,<br>కూచి నరసింహము.



### II. బ్రహ్మశ్రీ వేమూరి రామకృష్ణరావుగారు. M.A. L.T.

అయ్యా!

ఆసియాఖండమున కెల్ల నాస్థానకవీశ్వరుఁ డని వినుతిఁ గాంచిన రవీంద్ర

నాథుని "గీతాంజలి" నేఁటికే విమర్శనీయావస్థ నతిక్రమించిన యమూల్య గ్రంథము. అనువాదమూలమున నాపెన్నిధి నాంధ్రలోకమునకుఁ గూడ లభింపఁ జేసినమహోపకార మెంతయు స్తవనీయమును గృతజ్ఞతాపాత్రమును గాని వేఱొండు గాదు. అట్టి సదాలోచన నిజముగా దివ్యోద్బోధితము. మూలకవియొక్క గభీరభావకల్పనాశక్తియు, సిద్ధుని యాంతరదృష్టిమహిమయు, భక్తుని వివిధరసనిలయానుభవమును, మూలభాషనుండి యన్యభాషాధారమున మఱి మూఁడవభాషలోనికి వ్యక్తీకరింప సాధ్యమైనంత మీకృషి మాభాగ్యము కొలఁది నెఱవేర్పఁ గలిగితిరి. లలితపదములలోఁ దేటతెల్లముగ సామాన్యగ్రాహ్య మగురచనలయందు మీకుఁ గలయనల్పప్రజ్ఞ నెఱిఁగినవారికి మఱియొక యా నందదాయక మైనప్రమాణము నొసంగితిరి. తేటగీత తే గాని జీవితము నందుఁ జాలినతత్వము, తృష్ణ, తృప్తి! ధర్మపరాయణులకెల్ల నివ్వాని నొడగూర్చినందుకు వందనము లర్పించు,

కాకినాడ.
8-11-13

మిత్రుఁడు,
వేమూరి రామకృష్ణరావు.



## శుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 58 | 15 | వినవైరి | వినవైతిరి |
| 60 | 11 | పాలతల్లి | బాలఁ దల్లి |

# రామమోహననాటకముపై

## బుధజనాభిప్రాయములు.

I. బ్రహ్మశ్రీ వేమూరి రామకృష్ణరావుగారు. M. A. L. T.

"గీతాంజలి" యనువాదమునకు వెనువెంటనె "రామమోహననాటక" మనుచిన్నిపొత్తమును శ్రీ ఆదిపూడి సోమనాథరావుగా రాంధ్రవాఙ్మయమునకొసంగుట యెంతయు నానందదాయకము. వర్తమానయుగపురుషుఁ డనిపించుకొనిన శ్రీరాజారామమోహనరాయలజీవితమును గూర్చినదై, యమ్మహాపురుషునిజ్ఞానసంపద, భక్తిభాగ్యము, కార్యధురంధరత్వము, పూతచారిత్రము, దయాస్వభావము, దేశభక్తి, విశ్వజనీనలక్ష్యము, మున్నగువిశుద్ధలక్షణములనెల్ల నాదర్శనముకీతి వెల్లడించుచు, మఱియాతనిజీవితములోని ముఖ్యాంశములను వివరించు చున్నయీనూతననాటకము రామమోహనునికీర్తివిశేషమునుబట్టియె కీర్తనీయమయినది. సారస్వతవిషయికముగఁగూడ, ముఖ్యముగా గంగాతరంగిణీ హిమవత్పర్వతాది ప్రకృతివర్ణనములందును, సర్వేశ్వరసంభావనలందును మిక్కిలి స్వభావసిద్ధములు రసవంతములు నైనపద్దియములు ముద్దులు మూటకట్టునట్టున్నవి. కాని, లక్షణములో నాటకమునకంటెఁ బ్రబంధమునకు, లేక హరికథకు, అధికానుకూలమైనకథాసందర్భమగుటచే యారూపముననె రచించి యుండినచో, గ్రంథకర్తగారిపరిశ్రమమంతయు మఱింత యెన్నికకు నుపయోగమునకు రాఁగలిగి యుండెడిదనుట ప్రకృతకృతమునకంతగా లోటుకాదు. రామమోహనునికాలమునాఁటి దేశీయవివిధదురాచారదుర్మతములును ఆతనిచే నందులకై ప్రతిష్ఠాపింపబడిన సంస్కరణవిధానములును ఇందుమూలమునఁ జదువరులకు సోమనాథరావుగారి హరికథాశ్రవణము నందువలెనే పరిస్ఫుటము కాఁగలవు.

కాకినాడ.
26-11-13

వేమూరి రామకృష్ణరావు.

## II. బ్రహ్మశ్రీ వి. పి. రాజుగారు. B. A.

మీరు దయాపూర్వకముగా నొసంగిన రామమోహననాటకము చదివి సంతోషించితిని. స్త్రీలకు, బాలురకు, పాండిత్యము లేనిపామరులకు సహితము బోధపడులాగున మృదుశైలిని భక్తిరసపూరితముగ ఈచిన్నగ్రంథము రచించి భక్తులకృతజ్ఞతకు పాత్రులైతిరి. గొప్పనాటకములకు గావలసిన లక్షణములు దీనియందు గొన్ని లోపించి యుండవచ్చును. కాని రామమోహనరాయలవా రుపన్యసించిన తత్వములను పరస్పరసంభాషణరూపమున చక్కగ ముఖ్యాంశములను తేటపరిచి తియ్యనిపలుకులచే మనోహరము గావించితిరి. [illegible] భిన్నము, సిద్ధాంతములు భిన్నములు. వీటినిగురించి వ్రాసినగ్రంథములు స్థిరములుగావు. కాని భక్తిరసగర్భితములైన పుస్తకములు మాత్రము స్థిరములైయుండును. భక్తిరసముతో నిండిన ఈగ్రంథము తెలుగుభాషను చిరకాలము అలంకరించునని నమ్ముచున్నాను.

R.V.M.G. RamaRow Bahadur Orphanage, Cocanada, 25-11-13.

ఇట్లు తమవిధేయుడు,
వి. పి. రాజు.

---

## III. Mrs. Balantrapu Sundara Ramayya Garu,

Dear friend.

Many thanks for your kindness to send me a copy of Ramamohana Natakamu written by you. I have gone through the little interesting book at my leisure hours. Though I do not know much of Telug literature, my optional being Sanskrit, I make hold t express my opinion of the book. The style is simp and beautiful; the book is suited to modern tastes a is according to present requirements.

COCANADA.
25th November 13.

Yours sincerely,
Balantrapu Sundara Ramayya.